

## నమిలికొండ బాలకిషన్‌రావు


జననం : 06-09-1950, పూడూరు, కరీంనగర్ జిల్లా

తల్లిదండ్రులు : శ్రీమతి రత్నాబాయి, శ్రీ నారాయణరావు

విద్యార్హతలు : యం.ఏ., యల్‌యల్.బి.

వృత్తి : అడ్వకేట్

సహధర్మచారిణి : శ్రీమతి గోకులరాణి

సంతానం : శ్రీమతి కవితాభరద్వాజ్, డా॥ పాంచాలరాయ్, శ్రీమతి హరిత భరద్వాజ్


రచనలు : యువస్వరం (కవితా సంపుటి) 1981
అక్షరచిత్రాలు (సాహితీ మిత్రులపై కవితా చిత్రాలు) 1986
శాంతి-సమత (కవితాసంపుటి) 1989
అక్షరాల్లో అనంతం (కవితా సంపుటి) 1990
అక్షర ప్రతిబింబం (పుస్తక పరిచయ వ్యాస సంపుటి) 2006
ప్రసారకీయ కుసుమాలు (సంపాదకులు) 2010
అక్షర స్పందన (పుస్తక పరిచయాలు) 2010

సంపాదకుడు : ప్రసారిక (ఆధునిక సాహిత్యవేదిక) మాసపత్రిక 1982 నుండి మావిరసం (కవితా సంకలనం) 1990
"నివాళి" కాళోజీ రామేశ్వరరావుగారి స్మృతి సంచిక, 1997
సుక్కపొదుపు (ప్రసారిక ప్రత్యేక సంచిక) 2002

: అధ్యక్షుడు, సాహితీ సమితి, వరంగల్లు అనేక సంస్థలలో భాగస్వామ్యం

: "నమిలికొండ బాలకిషన్‌రావు - కవితాదర్పణం" - "యవస్వరం" కవితా సంపుటిపై 12గురు రాసిన వ్యాసాల సమాహారం టి. శ్రీరంగస్వామి సంపాదకత్వంలో

: "కాలం వెంట నడుస్తున్న. . ." (నమిలికొండ బాలకిషన్‌రావు కవిత్వంపై విశ్లేషణా వ్యాసాలు - డా॥ టి. శ్రీరంగస్వామి సంపాదకత్వంలో)

: "శాంతి-సమత" పేరుతో హిందీలోకి రేగులపాటి మాధవరావు గారు అనువాదం

: కొన్ని కవితలు శ్రీషరీఫ్ ఇమామ్ గారిచే ఉర్దూలోకి అనువాదం.


చిరునామా : ఇ.నెం. 6-7-61, రాగన్నదర్వాజ, హన్మకొండ, వరంగల్లు - 506 011

ఫోన్ : 2447407

సెల్ : 98493 82399


# అక్షర స్పందన

## నమిలికొండ బాలకిషన్‌రావు




ప్రసారిక
ఆధునిక సాహిత్య వేదిక
హనుమకొండ, వరంగల్

**AKSHARA SPANDANA**
(Pustakaparichayalu)

by
**Namilikonda Balakishan Rao,** M.A., LLB.



**షష్ఠిపూర్తి ప్రచురణ**

First Edition: September 2010

Prasarika Publicasam No. 7

Rs. 25-00

*For Copies:*
**N. Balakishna Rao,** M.A., LLB.
Advocate & Editor
**PRASARIKA**
6-7-61, Raganna Darwaza
Hanamkonda - 506 011

*Printed by:*
**Ashoka Krishna Offset Printers**
Beside Radhika Theatre
Warangal - 506 002

## అంకితం



ఈ కృతి

అమ్మా, నాన్నలకు. . . .

నమిలికొండ బాలకిషన్‌రావు

# బింబ ప్రతిబింబం

ఎందరో రచయితలు – కవులు, సాహిత్యకారులు వారి భావాలను, ఆలోచనల పరంపరలను, సామాజిక అంశాలను, వివిధ కోణాల్లో అన్ని విషయాలను ఒక కావ్యంగా, వ్యాస మంజరిగా, మరో పరిశీలనా, పరిశోధన గ్రంథాలుగా వెలువరించి పాఠకలోకం ముంగిట పెడతారు.

అలాంటి గ్రంథాలు అందరూ చూడలేకపోవడం, పఠించే సమయం లేకపోవడం, ఆ పుస్తకంపై దృష్టి రాకపోవడం, ఆ గ్రంథాలు అందుబాటులో లేకపోవడం మరెన్నో అంశాలను దృష్టిలో ఉంచుకొని రాసిన వాటిని ఒక విమర్శకుడిగా ఆ గ్రంథాన్ని సమాలోచన, సమీక్ష, పరిచయాలుగా ప్రసారిక ద్వారా అందించడం జరిగినది. వాటి నన్నంటిని ఒక ప్రోదిగా చేసి పుస్తకరూపం కల్పించాను. దీనివలన ఇందులో పుస్తకాలన్ని ఒకే దగ్గర ఒకసారి అవలోకించడానికి అవకాశం ఉంటుందనేది నా ఆలోచన.

నా చిన్ననాటి మిత్రుడు, సాహితీవేత్త డా॥ టి. శ్రీరంగస్వామి సహకారంతో ఈ గ్రంథాన్ని మీ ముందుంచుతున్నాను.

నా ఎదుగుదలను కనులారా చూడలేకపోయిన మా **అమ్మా, నాన్నలకు** ఈ చిన్న కృతిని జ్ఞాపకంగా అందిస్తున్నాను.

ఈ పుస్తకమును అందంగాను, అచ్చులో నలుగురి మెప్పు పొందేలా వెలువరించిన శ్రీ నాగుల యుగంధర్ గార్కి అభినందనలు.

5-9-2010 **నమిలికొండ బాలకిషన్‌రావు**

# రత్నాల మాయమ్మ

ఎన్ని జన్మలెత్తిననేమి
ఎంత ఋణం తీర్చుకున్న నేమి
మాతృత్వం ఋణం తీరదు
జన్మలెన్నైన సరి నాకు ఆ తల్లే కావాలి
ఆ తల్లికే నేనంకితం
ఆ ఒడిలోనే నిద్రపోవాలి ఆ జోలపాటలే వినాలి
ఆ రామాయణ, భారతాలు
ఇతిహాస, నీతి కథలు, గాథలు
చందమామ – బాలమిత్రలే మాయమ్మ చెపితే వినాలి
ఆ అమ్మ మనస్సు వెన్నపూస,
మా అమ్మ నడిచిన దారిలో మట్టి రేణువునైతే చాలు,
ఆ మృదు మధురమాటల్ని
ఉగ్గు పాలలో రంగరించి పోసిన జ్ఞాపకాలు
ఊయలలో ఊగిన ఊయల పాటలు
ఇంకా, ఇంకా వింటూనే ఉన్నా
నిద్రపోతూ కలలు కంటున్నాను అమ్మ ఒడిలో
ఆపై ఉలికిపడి కెవ్వు కెవ్వున ఏడిచిన
గాఢ నిద్రలో ఒక్కసారిగా లేచిన నన్ను
దగ్గరగా తీసుకొన్న మాతృత్వం
ఎలా చెప్పను ఆ ప్రేమానురాగాల అమ్మ ఒడి.

ఆపై జిష్టి తీసి ఊదుపొగలు వేసి నిద్ర పుచ్చినవేళ
అమ్మ, ఓ బాల్యానికి చేయూత,
బుడి బుడి నడకలు నేర్పిన అమ్మ,

నా, నీ అమ్మ, మన అమ్మ,
నేటికి నా నడవడికి న్యాయదేవత అమ్మ
ఎన్నో పండగలకు, తానో పండుగై.
నిద్రలేచింది మొదలు మంగళ హారతితో,
తలంటి స్నానాలు, వెండి వంటలు
క్రొత్త బట్టలు ధరింపజేసి,
తానో యంత్రంలా సాగే దినచర్యతో. . .
తానో కొవ్వత్తై వెలిగేది అమ్మ
అమ్మ పనుల్లో – నా చిన్ని చేతులతో
చిన్న – చిన్న పనులు చేస్తే
ముద్దాడి – ముద్దిచ్చి చేతులను తీసుకొని ఒత్తి,
"నా బంగారం" అన్న అమృత మూర్తి అమ్మ,
తానొడిలోకి తీసుకొని నిమిరి – నిమిరి నిద్రపుచ్చి
తాను ఆదమరిచి నిద్రపోతు
రవివర్మ బొమ్మ. . . అమ్మ నా గురువే మా అమ్మ
నా పెద్ద చదువులకు, సరస్వతి మా అమ్మ,
నా అక్షర కవితలకు అమ్మే అమృతాక్షరం
న్యాయ పట్టా వచ్చిన రోజే,
నాయమ్మ ఎంత సంతోషిస్తుందో అనే ఆశతో
ఏరుదాటి ఊరు చేరిన నాకు
అమ్మ జీవం, నిర్జీవమై. . .
ప్రకృతి ఒడిలో కల్సిపోయింది అమ్మ
నా జీవత్వానికి అమ్మ పెన్నిధి
ప్రకృతి పచ్చజండా ఊపుతూనే ఉంది అమ్మ
నన్ను నన్నుగా ఎదగడానికి
తానే పృథ్వియై నిల్చింది అమ్మ.



## 'నాన్న'

అమ్మా !!
నాన్న జ్ఞాపకాలు ఇంకా జ్ఞాపకాలుగానే ఉన్నాయి.
నాన్న !
ఉద్యోగం, సంపాదన కోసం
ఊర్లు – ఊర్లు తిరగడం
వారానికో నెలకో
ఒకసారి వచ్చే నాన్న
ఉదయాన్నే బడికి వెళ్ళి
సాయంత్రం ఇంటికి వచ్చేసరికి
నాన్న ఊరెళ్ళాడని వార్త
నాన్న నన్ను వీధిబడిలో చేర్పించి
ఆపై పురానిపేట జగిత్యాల
ఇంటి ప్రక్క మల్లేశం సారు బడిలో చేర్పించి,
పుట్టిన తేది వివరాలు వారి లెక్కల్లో వేసినవి
నాకు ఇంకా నా పుట్టిన తేదీనే జ్ఞాపకం చేస్తున్నవి.
ఆనాడే నాన్న నేనొక
ఇంజనీర్ కావాలని బాటనీలో
ఉన్న నన్ను లెక్కల్లోకి మార్చాడు
ఆ లెక్క అర్థంకాలేదు.
ఆశ ఆశగానే మిగిలిపోయింది.
నేను న్యాయవాదిగా, ఆశావాదిగా, కవిగా మారాను.
నాన్న !!

నాకో అన్నను, అక్కను,
ఆపై ఇద్దరు చెల్లెళ్ళను
ఇద్దరు తమ్ముళ్ళను ఇచ్చాడు
ఆపై మా అమ్మకు
బాధ్యతలను అప్పజెప్పి
ముందు తానుగా,
ఆపై అమ్మనూ తీసుకెళ్ళాడు.
పసి బాల్యంలో
నాన్న ప్రేమే తెలియదు.
వయస్సు పరుగులో
పడుతూ లేస్తూ నాన్నా
నీ బాధ్యతల, సంసార బంధనాలు మోస్తూ
సంఘంలో మన ఇంటిపేరు, మీ పేరు శిలాశాసనంగా
మోస్తూ, మోస్తూ. . . వారసునిగా నిలదొక్కుకుంటున్నాను
నిజంగా నీ వారసున్ని
నీ శిక్షణా సుపుత్రున్ని
సువిశాల ప్రపంచంలో పౌరున్ని
వసుదైక కుటుంబంలో పుణ్యపుత్రున్ని
నాన్న కవిత్వానికి సాగిన కలాన్ని నేను.



# శ్రీ పెండ్యాల రాఘవరావు జీవన సాహిత్యం – ఒక పరిశీలన

జీవిత చరిత్ర రాయదలచుకున్నవారు ఏ రోజుకారోజు దినచర్య రాసుకొని ఉంటే వడపోత ప్రమాదం నుండి తప్పించుకోవచ్చు కానీ అప్పుడు కూడా కొన్ని సమస్యలున్నాయి. ఆ దినచర్యలో అన్ని ఘటనల నమోదు చేయడం సాధ్యముకాదు, ఏదీ తప్పిపోకుండా అన్నీ చేస్తారనే అవకాశమూ లేదు. చేసిన వాటి ప్రాధాన్యతలు సక్రమంగా గుర్తింపుకు వస్తాయనే నమ్మకమూ లేదు కందుకూరి వీరేశలింగం నుండి ఇప్పటి వరకు స్వీయచరిత్రలు రాసుకున్న ప్రముఖులందరూ తమ జీవిత కథనాలపైన ఎక్కడో ఒక చోట కత్తెరలు వేసుకున్నారు. తన జీవితక్రమంలో ఏయే సామాజిక రాజకీయ ఘటనలకు ఎలా స్పందించాలో రాయడం ద్వారా సామాజిక చరిత్రను ప్రకటించడానికే శ్రీ పెండ్యాల రాఘవరావుగారు ప్రయత్నించారు. అందువల్లనే తన గురించి, తనకూ తన తండ్రికీ, సోదరుడికీ వచ్చిన ఘర్షణల గురించి రాసినప్పుడు కూడ అదంతా సామాజిక శక్తుల మధ్య ఘర్షణగానే సమాజంలోని అభివృద్ధికర భావజాలానికి, అభివృద్ధి నిరోధక భావజలానికి మధ్య ఘర్షణగానే వచ్చిందిగాని కుటుంబ విషయాలపై రాలేదని వివరించారు.

సమావేశ స్థలాన్ని తన స్టేట్‌గా ప్రకటించి సాలార్జంగ్ స్టేట్ అధికారులు ప్రవేశించడానికి వీలులేదని చెప్పిన తీరు, "ఓమ్" జెండా విషయంలో తాసిల్దార్‌ను ఒప్పించిన తీరు, కోర్టు ఘటనలో న్యాయాధిపతిని ఇబ్బంది పెట్టడానికి బ్రాహ్మడి చేత తప్ప నీరు తాగనని చెప్పిన తీరు, కమ్యూనిస్టుల గురించి రష్యా ఏజంట్లనే వాదన ఒకవైపు, వృద్ధాప్యం వల్ల ఆరు దశాబ్దాల వెనుకటి జ్ఞాపకాలు కావడం వల్ల వారి జ్ఞాపకాలలో కొంత పునరుక్తి, కొన్ని ముందు వెనకలు వచ్చాయి. వారు చెప్పిన విలువైన విషయాలలో నుంచి రాఘవరావు గారి జీవితానికి సంబంధించిన భాగాలను సూచించారు. అంటే పెండ్యాల నెల్లుట్ల వంశాల మధ్య తరతరాలుగా సాగుతున్న సంబంధ బాంధవ్యాల పందిరిలో, ఒక గొప్ప ఆలోచనా ఆచరణా సంప్రదాయాన్ని నిలబెట్టిన, బహుశా మొదటిసారిగా **1934** నుండి తుదిశ్వాసవరకు ప్రజల మనిషిగా జీవితాన్ని గడిపాడు. ఈ జ్ఞాపకాలు చెప్పడం విశేషం. శాసన సభా సభ్యుల ఛాయచిత్రాలు. పార్టీ

ఛాయాచిత్రాలు, కుటుంబ ఛాయాచిత్రాలతో చక్కని నూనుగు మీసాల ఛాయాచిత్రం చక్కని పుస్తకాన్ని మలిచారు.

ఎవరి ఆత్మకథలైనా, జీవిత చరిత్రలకైనా ఆ వ్యక్తి జీవితాన్ని సమగ్రంగా నిర్దుష్టంగా, ఆ జీవితంలోని ఏ ప్రధానాంశాన్ని వదలకుండా వ్యక్తీకరించగలమా అనేది అనుమానమే. ఎన్నో జీవిత చరిత్రలు వెలువడిన సందర్భంలో కూడా ఆ మనిషి జీవితకథ సంపూర్ణంగా వచ్చిందని చెప్పడానికి వీలుండదు. ఆ వ్యక్తి గురించి ఇతరులు రాసే జీవిత చరిత్రలోనైనా ఆ వ్యక్తి జీవితంలోని వైవిధ్యంలో విస్తృతితో, లోతుతో, అనుకూల ప్రతికూల అంశాలన్నింటితో ఆ వ్యక్తి జీవించిన జీవితమంతా సంపూర్ణంగా వస్తుందని చెప్పడానికి వీలు లేదు. రాఘవరావు గారి జీవితమే తీసుకుంటే ఆయన జీవితం అనితర సాధ్యమైనది. ఇరవైలలోనే తన ఇంట్లోనూ బయటా వితంతు పునర్వివాహాలు చేయించిన సంస్కర్త ఆయన. దళితులతో సహపంక్తి, భోజనాలు తెలంగాణా వరకు ఇవి తొలి వేకువలాంటి అంకుర ప్రాయమైన ఘటనలే. ఆయనలాంటి ప్రజల జనాకర్షక నాయకుడికి కనీసం లక్ష మందితో సంబంధం ఏర్పడి ఉంటుంది. ఆయన లక్ష హృదయాలను కొద్దోగొప్పో తట్టే ఉంటాడు. అవన్నీ కలిపితే గాని ఆయన జీవిత కథ పూర్తికాదు. అదే ఈ "నా ప్రజా జీవితం" శ్రీ పెండ్యాల రాఘవరావు సమగ్ర విశ్లేషణ - ఈ పుస్తక ప్రచరణకు వేణుగోపాల్ కృషి అభినందనీయులు.

సొంత ఇంటిలోనూ బయట వితంతు పునర్వివాహాలు చేయించిన ఆదర్శవాది. నిజాం నిరంకుశ రాజ్యంలో తొలిస్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహి. హైదరాబాద్ రాజ్యంలో చైతన్యం రాజేసిన ఆంధ్రమహాసభలో జాతీయ పక్ష కార్యకర్త, తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటంలో దళనాయకుడు అజ్ఞాత వాసుదు అటు సత్యాగ్రాహిగా ఇటు పోరాట యోధుడుగా మూడు సంవత్సరాలు ఖైదీ. తొలి సార్వత్రిక ఎన్నికలలో పీపుల్స్ డెమొక్రటిక్ ఫ్రంట్ అభ్యర్థిగా వరంగల్ లోకసభ స్థానాన్ని హనుమకొండ, వర్ధన్నపేట శాసనసభాస్థానాలనూ గెలుచుకున్న విజేత 1952 నుండి 1957 దాకా తొలి లోక్‌సభలో ప్రజాగళం వినిపించిన వక్త. గ్రామ పంచాయితీల అధ్యక్షుడిగా స్వగ్రామాన్ని అభివృద్ధి చేసిన చిన్న పెండ్యాల బిడ్డ. అనితర సాధ్యమైన దేశచరిత్రకు మాణిక్యం వీరు.

చిన్న పెండ్యాల రాఘవరావు గారి "నా ప్రజా జీవితం" - కావలసినవారు జి-మైత్రిరెసిడెన్సి 3-6-394, స్ట్రీట్ నెం. 3- హిమాయత్ నగర్, హైదరాబాద్ - 500 029కి యాబది రూపాయలు పంపి పొందవచ్చు.



# చలపాక "చూపు - మానవత"

చలపాక ప్రకాశ్ మానవతావాది అనుటకు ఈ కవితా సంపుటి 'చూపు' సాక్ష్యంగా నిలుస్తుంది. 'చూపు' అంటే దృష్టి. మన దృష్టిని అనుసరించి మన ఆలోచన సాగుతుంది. అందుకే ఎవరి దృష్టిని బట్టి వారు అనే సామెత వచ్చింది. కొందరి దృష్టి అందరి కొరకు చూస్తుంది. సార్వజనీకంగా చూసే వాడిని సామాజికుడుగా గుర్తింపబడుతాడు. చలపాక ప్రకాశ్ దృష్టి సార్వజనీనకము అయినది అని ఈ చూపు కవితా సంపుటి ధృవీకరిస్తుంది.

మానవుడు సంఘజీవి. సంఘములో నున్న పలు అంశాలకు స్పందిస్తాడు. చరిస్తాడు. భావుకత ఉన్నవాడైతే ఆ స్పందనను తన మాటల్లో వ్యక్తీకరిస్తాడు.

ఎన్ని అలలు ముందుకొచ్చి దడిపిస్తే నేమి. . .
ఒక ధైర్యం ముందు ఒణికి పారిపోవడానికి
ఎన్ని వాదులు వాగులై పొంగితే నేమి
మానవత్వం ఒక్కటే నిజమైన సాక్షిగా
నిలిపి ఉండాడిని *(నిలిపుండాడనికి)* (పుట-*29*)

మానవతా దృక్కోణం కవిలో ఎంతగా ఉందో ఇలాంటి కవితల్లో మనం చూడవచ్చును. ప్రకాశ్ గారు ఈ కవితలో "నిలిపుండాడనికి" అని పదంవాడారు. ఈ విధముగా ప్రయోగించటము వాడుక భాష ననుసరించి అంటే మనము ఎలా మాట్లాడుతామో అలానే రాయడం అనుకోవచ్చును. కాని ఒక్కొక్కప్పుడు మాట్లాడినది మాట్లాడినట్టుగా రాస్తే అది చదివినప్పుడు ధారాళంగా అనిపించదు. కరచుకున్నట్టుగా అనిపిస్తుంది.

మానవతా విలువలను తరచి తరచి చెప్పుతాడు. సమైక్య జీవనం ఎలా ఛిద్రమైపోతుందో విడమర్చి చెప్పుతున్నారు.

కలసి ఉంటే కలదు సుఖం పాత చింతకాయ పచ్చడైపోతోంది
ఫ్యాషన్ ప్రపంచం నవనాగరికత ముసుగు తొడుక్కుంటున్నది

'ఉమ్మడి' ఆనందాలు చిన్నవిగా
చింత చెట్టు క్రింద చతికల పడిపోతున్నాయి (పుట- 33)

అంతే కాకుండా ప్రస్తుతం టి.వి.లలో వస్తున్న సీరియల్స్‌లో చూపిస్తున్న అవాంఛ నామధోరణులు మానవ సంబంధాలపై ఎలా ముద్రవేస్తుందో కూడా నిష్కర్షగా చెప్పారు.

ప్రతి ఇంట్లో మానవత్వపు విలువలు దిగజార్చె
శిక్షణా శిబిరాలుగా తీర్చిదిద్దుతున్నవి
ఈ బుల్లితె (రా)ర సృష్టించే సీరియళ్ళే అంటే
అబద్ధమనే దెవరు ? (పుట- 44)

ఇంకా-

పచ్చ పచ్చని సిరులను పంచే
మానవత్వపు పరిమళ సుగంధాలను
నలుదిక్కులా వెదజల్లేలా దీవించి
ముందుకు నడిపిస్తావు కదూ. . . (పుట-64)

అయా ఆశాతత్వాన్ని ప్రదర్శించారు.

ఈ 'చూపు' కవితా సంకలనంలోని 45 కవితల్లో ప్రతిది మానవతా నేపథ్యముతోనే సాగింది. అందుకే ఈ సంపుటిలోని కవిత "ఓ ప్రశ్న. . .?" లో ఇలా అడుగుతున్నారు.

కాళ్ళకున్న మట్టిని కడగడమే కాదు
మానవతా విలువలకు పట్టినచీడయా
ఏ మినరల్ వాటర్‌తో కడుక్కుందామో
కాస్త మీరు చెబుతారా ! అని అడుగుతున్నారు. (పుట-75)

ప్రస్తుత సమాజంలోని సంఘటనలపై చలపాక ప్రకాశ్ గారు తీవ్ర స్పందనకు గురి అవుతారనుటకు ఈ కవితలు సాక్ష్యం. చలపాక ప్రకాశ్‌లోని సృజనాత్మక కథ, నానీలు, కవితలు, కార్టూన్‌లు విస్తరిస్తూనే, రమ్యభారతి పత్రిక ద్వారా అనేక సాహితీ మిత్రులతో చేయి చేయి కలుపుతుంది.

పాఠకుల చూపును తన 'చూపు'లో ఇమిడించికొంతఆలోచింప చేసే విధముగా ఉండే కవిత్వాన్ని అందించినందులకు ప్రకాష్‌ను అభినందించవలసినదే మంచి కవిత్వమును చదువాలనే ఆసక్తి ఉన్నవారు ఈ పుస్తకాన్ని ఒకమారు చదవాలి. కాలక్షేపము నకు కాకుండా ఒక అచ్చమైన కవితా పుస్తకం చదివిన అనుభూతిని పొందుతాం.



# సామాన్యుడి అందుబాటులో భాగవతం

సామాన్యుని దృష్టిలో పోతన ఒక గొప్ప భక్తుడు. ఆయన అందించిన భాగవతం పరమ పూజనీయమైనది. అది చదివితే పునర్జన్మ అంటూ ఉండదు. కవి అంటే అలా ఉండాలి. డబ్బుల కమ్ముకోకుండా దేవునికే అంకితమిచ్చిన నిజమైన కవి. ఆయన వినయ విధేయత అందరినీ ఆకర్షిస్తుంది. ఈ భాగవతము తను రాయలేదని మొదలే ఇలా చెప్పుకున్నాడు.

పలికెడిది భాగవతమట !
పలికించెడువాడు రామభద్రుండట నే
బలికిన భవహరమగునట !
పలికెద వేఱొండుగాథ పలుకగనేలా !

అనుకొని భాగవతమును అందించినాడు.

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు !
శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనుల వలన విన్నంత కన్నంత,
దెలియ వచ్చినంతదేటపఱుతు

శివుడు, బ్రహ్మలు కూడా భాగవతాన్ని చక్కగా సమగ్రంగా తెలుసుకొని చెప్పలేదంటే ఇక నా సంగతి వేరే చెప్పాలా ! అయితే పెద్దల వల్ల విన్నంత, కన్నంత వారి సన్నిధిలో నేర్చుకున్నంత విషయాన్ని తేట తెల్లం చేస్తానని అంటాడు.

పోతన సామాన్యుని దృష్టిలోనుంచుకొని ఈ రచన చేసినట్లు అనిపిస్తుంది. భగవతత్త్వమును ప్రతి ఒక్కరూ ఆస్వాదించాలనే భావనతోను సామాన్యునికి అనేక అంశాలను ఇందులో చేర్చి, ఈనాడు అవి వాడుకలో ప్రముఖంగా నిలిచేటట్టుగా దానిని తీర్చిదిద్దినారు అనుటకు ఈ పద్యపంక్తులకు చెప్పుకొనవచ్చును.

- అలవైకుంఠపురంబులో నగరిలో నా మూల సౌధంబు దాపల. . .

- జనములు నేర్చిన విద్యలు జననాథుని కొలకుc గాదె

- ఎవ్వనిచేజనించు, జగమెవ్వని లోపల నుండు

- "అన్యమెఱుగదు తన యంత నాడుచుండు మంచి వాడి తడెగ్గలు మానరమ్మ"...

- అమ్మా మన్ను దినంగ నేశిశువునో యాకొంటినో వెఱ్ఱినో

- నమ్మంజూడకు వారి మాటలు. . .

- కలయో, వైష్ణవ మాయయో, ఇతర సంకల్పార్థమో

- ఏ రూపంబున దానిగెల్తు, నిటమీదే వేల్పుజింతింతు

- కలదందురుదీనుల యెడc, గలదందురు పరమయోగి గణముల పొలం

- గలcడందురన్ని దిశలను, గలcడు గలండనెడు వాడు గలడో లేడో

- లావొక్కింతయు లేదు ధైర్యము. . .

- చేతులారంగ శివుని పూజింపడేని

భాగవతములోని అనేక కథలు, పదాలు జనసామాన్యములో వ్యాపించి, జన జీవనములోని అనేక సందర్భాల్లో సందర్భోచితముగా ఉండి ఉటంకించబడడముగా సాగుతూనే ఉంది. అందువలన భాగవతము జన సామాన్యములో అజరామరముగా నిలిచి పోయినది. కృష్ణ కథలు కూడా ఇంటింటా నిలిచినవి. జానపదగేయాలై హరికథలై జీవన సాంద్రతలో కలిసిపోయినది. అందుకే భాగవతం ఇంటింటా తెలుగు పలుకుబడిగా మిగిలింది. ఇందుకు పోతన భాగవత సంగడు గాడు కావడం చెప్పుకోదగినది.



# తెలుగు "కావ్యజ్ఞాని" శ్రీకేతవరం

జిజ్ఞాస – పన్నెండు వ్యాసాల సంకలనం. ఏడు వ్యాసాలు 1957 నుండి 1978 వరకు కృష్ణా పత్రిక, స్రవంతి, సాహితి, భారతి మొదలైన పత్రికలలో ప్రచురించబడ్డాయి. చివరి రెండూ సమావేశాలలో ప్రసంగించడానికి వ్రాసుకొన్నవి. మిగిలినవి శీర్షికలు కూడా లేకుండా విడివిడిగా కాగితాల మీద వ్రాసుకొన్న ఆలోచనలు. సాహిత్య చరిత్రలో వాటికి పూర్వరచనలతో వున్న కార్యకారణ సంబంధాన్ని నిరూపించి ఆ వ్యాసాలు సాహిత్య చరిత్ర విద్యార్థులకు అవశ్య పఠనీయం అవుతున్నాయి.

జిజ్ఞాస ఎక్కడి నుండి ప్రారంభమైతే కావ్యతత్వ నిరూపణ వరకూ ఎలాంటి ఆటంకం లేకుండా పొగుతుందో తెలిసిన సమగ్రసాహిత్య దృక్పథం. "తెలుగు సాహిత్య విమర్శ – పరిశోధన" లకు సంబంధించి కవి వ్రాసిన వ్యాసాలను దృష్టి – దృశ్యం అన్న పేరుతో పుస్తకంగా వచ్చింది.

రామకోటిశాస్త్రి రచనలను ప్రతియేడూ ఒక్కొక్కటిగా ప్రచురించటం మహా మనిషికి ఇచ్చే నివాళి అని, సాహిత్య వారసత్వాన్ని ఇంత నిరంతరాయంగా కొనసాగించటం అభినందనీయం. ఈ వ్యాసకర్తగా నేను వారి శిష్యుడుగా విధేయత చూపడం నా బాధ్యతగా భావిస్తున్నాను.

బాలం భట్టు మంథెన రామాయణం యక్షగానమైనా దానిలో దృశ్యకావ్య ప్రక్రియే ఎక్కువగా కనబడుతున్నది. పురాణం చెప్పే ధోరణికి, హరికథ చెప్పే తీరుకూ, జంగం కథ చెప్పే పద్ధతికీ అనుగుణంగా బాలంభట్టు యుద్ధకాండ పర్యంతంగా రామాయణం కథ వ్రాసాడు. పద ప్రయోగ కోశములను సిద్ధము చేయుటకు ముందు పద ప్రయోగ నిర్ణయము జరుగవలెను. ఇక కపిల అన్న శబ్దమునకు మోట అని అర్థము చెప్పుకొనుటయున్నది. 'గాయకులు' పూర్వము రాజస్థానములలో కవి, గాయక, నటులతో పాటుండిరి. వారి పని కావ్యముల నా విధముగా పఠించుటయే. తెనుగున ఈనాడిది నశించినది. కన్నడమున నింకనునున్నది. ఇది నిక్కచ్చి నిజం. అంతేగాని "పాకు దాల్చి" "పాకు దాల్చు" అను రెండును . . . . . . పాఠములే. శాస్త్రి గారి నిక్కచ్చివాదన కావ్యజిజ్ఞాస. భిన్న భిన్న ఛందస్సులతో గల పద్యాలతోను గద్యాలతోనూ

కూడి వుండుటయే చంపూకావ్యస్వరూప లక్షణం అని నిర్ధారించినారు శ్రీ శాస్త్రిగారు. మనస్సు చేత ముందు వెనుకల మీద పర్యాలోచించి కావ్య వస్తువును కవి నిర్ణయించుకొనును. ప్రయోజన దృష్టి లేకుండా కావ్యమును కవి వ్రాయడు. మహాకవులు కావ్యములకు బహుళ ప్రయోజనము లుండును. ఒక మతము, ఒక తత్త్వము, ఒక ధర్మము, ఒక నీతి, ఒక తంత్రము, ఒక శాస్త్రము, ఒక శిల్పము, ఒక భావము వీటితో గాని, కొన్నింటితో గాని సంబంధము కల్పించబడిన ఒకానొక వైశిష్టమైన జీవితా విధానమును మహాకవులు తమ కావ్యములయందు నిరూపించారు. ఏ ఒక్క తెనుగు కావ్యమును గానీ, దానికి మూలమని చెప్పబడుచున్న సంస్కృతమునందలి ప్రతి ఒక్క శ్లోకము తోనూ పోల్చి తెనుగు కవి ఇన్ని మెరుగుల పెట్టినాడని నిశ్చయించి చెప్పిన విమర్శకుడు లేడు, కావ్యరచనమున కవి జాగ్రత్తపడే అంశములు 1. శబ్దము 2. అభిప్రాయము 3. భావము 4. రసము - ఇది యొక వరుస.

ప్రతి కావ్యమునందును తొమ్మిది రసములను భావములను కూర్చి వర్ణించుటను పెట్టుకొనరాదు. నవరస భావములలో అవసరమగునవి వర్ణింపబడి కావ్యము సిద్ధము కావలయును. - శాస్త్రీయ భావం శాస్త్రి భావం. శ్రీనాథుని కృతులన్నియు ఆయన ఈశ్వరార్చనకు దర్పణములు. నైషధమునందు కళాకౌశలము యొక్క అవిష్కృతియున్నది. కావ్యజ్ఞాని శాస్త్రి కావ్యదృష్టి. కథను ముందుకు నడిపించుటకు, సన్నివేశముల వైలక్షణమును నిరూపించుటకు, నైతిక వాతావరణమును సృష్టించుటకు మరియు కొన్ని తావుల ఆయా పాత్రల మనస్తత్వమును, వ్యక్తిత్వమును ఆలోచనా విధానములను అనుభవ సాంద్రతను కూడా వ్యక్తము చేయునవిగా యుండును. శాస్త్రిగారి అభిప్రాయం ఒక ఫైల్ నోట్ తెలుగు భాషకిచ్చారు. కవి చక్కగా లోకమును దర్శింపవలయును. వట్టి కూపస్థమండూకముగా నుండి తానేదో మహా పండితుడని కవి యొప్పుడును భావింప రాదు. శాస్త్రజ్ఞాన మెంతయపారమో లోకజ్ఞానమును అట్లే అపారము. ఎంత సంపాదించినను సంపాదింపవలసినదింకను మిగిలియేయుండును. వితండవాదములకు దిగరాదు. విష్ణుభక్తి ప్రచారానికి జనంలోకి భాగవతాన్ని తీసుకొనిపోతారు. కానీ ఆముక్తమాల్యద తీసుకొనిపోరు. భారత భాగవత రామాయణాలే మహాకావ్యాలుగా ఇంతకాలం నిలబడటానికి విజ్ఞానాత్మకమై ఆలోచనామృతము. శాస్త్రిగారి ఆలోచనల్లో ఒక పేజీ.

హరిశ్చంద్రుని కథ తెనుగున కావ్యములుగా, నాటకములుగా పలువురు రచించిరి. కవులచేత వ్రాయబడిన ప్రచారమున నున్న ఈ హరిశ్చంద్రుని కథ ఋగ్వేదము,



ఐతరేయ బ్రాహ్మణము 33, 34 అధ్యాయములందును, స్కాందమునను, మార్కండేయ పురాణమును, భాగవతమునందును, దేవీ భాగవతమునందును నున్నది.

**ఉద్భటారాధ్య చరిత్రము - శత్రఘ్నవిజయ ప్రబంధము:**

"భావార్థ పేటిక" శ్వాసముల - పదివందల తొంబదియారు గద్య పద్యములు కాగితపు వ్రాత ప్రతి రూపమున నీ ప్రబంధము కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తున కలదు. వ్రాత ప్రతిలో నీ చతుర్ధాశ్వాసమున 54వ పద్యము లేదు. కొంత జాగా వదలబడియున్న వ్రాయనారంభించినట్లు భావించాలి. శాస్త్రిగారి ఆలోచన, వారి ఆవేదన. కట్టమంచి రామలింగారెడ్డి గారంతటి ఉన్నత వ్యక్తి, భావనాశక్తి మహిమను ప్రకటించాడు. దాని అభివృద్ధి క్రమంలోనే ఇప్పుడిప్పుడు వేమన కవిత్వం గురించి విశ్వవిద్యాలయాలు పరిశోధన కార్యక్రమాలు నిర్వహించే దశకు వచ్చాయి. వేమనను గురించి మాట్లాడటమేగానీ, వ్రాయటమే గాని చేసిన ఘనకార్యాలేమీ లేవు. మనకు వర్తించవన్న ధోరణిలో ఇతరులను గురించి అంటాం.

తెలుగు కవులు చరిత్రలను వ్రాసిన వారు కానీ, తెలుగు సాహిత్య చరిత్రలను వ్రాసినవారు కానీ వేమన్నను కవిగా గానీ, సాహిత్యకారుడుగా గానీ గుర్తించిన వారు లేరు. తెలుగు, తమిళ, సంస్కృత గ్రంథాలను భారతదేశం నుండి సేకరించి ఫాదర్‌లేగాక్ అనే ఫ్రెంచ్ మిషనరీ ఫ్రాన్స్‌కు చేరిన ఒక కట్టలో వేమన పద్యాలున్నాయట. వేమన పద్యాల గ్రంథమొకటి ఉందన్నమాటే. వేమన్న గురించి ఫ్రెంచ్ వారికి తెలియజేసినది. ఆ బేదుబాయ్ అన్న మిషనరీ. ఆయన వ్రాసింది చదువుకొనే బ్రౌను వేమన్నను గురించి 1823లో తెలుసుకున్నాడు. ఇప్పటికీ అన్ని పద్యాలూ సేకరించబడి ఒక చోట గ్రంథంగా మనకు లభించలేదు. శాస్త్రిగారి ఆవేదన నేటితరం పరిశోధనల ద్వారా కృషి చేయాలి. "దర్శనములు వేలు దైవంబుదొక్కటే". బ్రాహ్మణులను - ఇటు శైవులనూ - వైష్ణవులను దూషించిన వేమనకు మళ్ళీ - దేవుడంటే నమ్మకం వుంది. అది చిత్రం. శివుడు లేడు విష్ణువు లేడు అంటాడు. కానీ దేవుడు లేడు అని అనడు వేమన. ప్రాచీనాంధ్ర సాహిత్యం అంతా మత తాత్త్విక భావాలు అంతా విద్యా ప్రభావంతోనే ఉంది. "తెలుగు సాహిత్యంలో - అద్వైత వేదాంత ప్రతిఫలనరూపాలు" అన్న విషయం నిజంగా విద్వాంసులు పరిశోధన చేయదగిన అంశం.

కావ్యజిజ్ఞాస 12 వ్యాసాలతో, ఆరు ఒకటి నుండి ఆరు ఏడు వరకులోచూపు మొత్తం పందొమ్మిది శీర్షికల వ్యాసాల ముద్దమందార సాహిత్య గుభాలింపు పరిశోధనలకు చక్కని 'కీ' నోట్స్. "దృష్టి - జిజ్ఞాస".

## శుభాకర భావ సౌందర్యాలు - కర్నూలు సుగంధం

ఈనాడు ఆలోచనాపరులు, తాము విధించుకున్న ఏదో ఒక పరిధిలోనే తమ భావాల్ని వెలువరిస్తూ ఉంటారు. జి. శుభాకరరావు సమకాలీనమైన ఆలోచనలు చెయ్యడం. వాటిని తనదైన విశ్లేషణ ద్వారా వెలువరించటం ప్రశంసనీయం. గ్రంథ సమీక్షకులు ఈనాడు ఎలా వ్యవహరిస్తున్నారో ఎలా ఉంటే సమీక్షను బాగా చెయ్యగలరో చెప్తారు. విమర్శించేటప్పుడు పాటించాల్సిన సంయమనం. విషయ విశ్లేషణాసక్తి, భాషా పాటవం లాంటివి సమీక్షకునికి ఉండాల్సిన అదనపు అర్హతలు అంటారు. ఈనాటి సమీక్షకుల్లో లోపాలు తెలుస్తాయి. మంచి సమీక్ష ఎలా ఉండాలో తెలుస్తుంది. వారి, వారి విశ్లేషణలోనే!

"తెలుగు తోటలో విరబూసిన నవ్వుల పువ్వులు" వ్యాసం తెలుగు సాహిత్యంలోని హాస్యాన్ని సోదాహరణంగా అందిస్తుంది. తనదైన హాస్యరీతికి దర్పణమైన రచనలకి ఇంతకు ముందే సుప్రసిద్ధులు. "బాలల సాహిత్యం ఎలా ఉండాలి" అనే వ్యాసం. బాల సాహిత్యంపైన వచ్చిన వ్యాసాల్లో అగ్రశేణికి చెందుతుంది. 'గ్రామీణ యువతకు అవసరమైన పుస్తకాలు' వ్యాసం ఈనాటి నిరుద్యోగ గ్రామీణ యువకులకి ఎలాంటి పుస్తకాలు కావాలో అందువల్ల ఎలా దేశం పురోగమిస్తుందో చెప్తారు. అన్నమాటకి కట్టుబడి వుండటం, ఎలాంటి హిపోక్రసీ లేకుండా ఏం చెబుతారో అదే చేయడం ఆయన నైజం ! గర్వమూ, ఆత్మ గౌరవమూ రెండూ ఒకటికాదని ఆయన ఉద్దేశ్యం ! తన పదిహేనవయేటనే ఆయన రాసిన కథలు, కవితలు పత్రికల్లో అచ్చయ్యాయి. కర్నూలు జిల్లాకు పేరు తెచ్చిన 'తేజోమూర్తులు' పట్ల ఆయనకు గల ఆరాధనా భావమే ఆయనచే "కర్నూలు జిల్లా అమరజ్యోతులు" రాయించింది.

విద్యార్థి దశలోనే ఆయన తన స్వీయ రచనలతో ఓ లిఖిత పత్రికను నిర్వహించి, ఉపాధ్యాయుల ప్రశంసలను, పాఠశాల వారి రజత పథకాన్ని పొందారు. ఆయన వేసిన రంగుల చిత్రానికి కాకినాడ చిత్ర కళానికేతన్ తరుపున శ్రీ ఏడిద గోపాలరావ్ గారి నుండి ప్రశంసా పత్రాన్ని పొందారు. అందమైన తన చాయ చిత్రానితో భావసౌరభాలు వ్యాసములను తెలుగు పుస్తక వరసలో కూర్చిన వారికి వారేసాటి అభినందనీయులు.



## తెలుగు పత్రికల్లో ఆణిముత్యం 'ఎక్స్‌రే'

జీవన చైతన్య ప్రవృత్తిని వాస్తవ చైతన్యంతో పరిపుష్టం చేస్తూ యువకలాలు స్పందించటం సాహితీగమనంలో చరిత్ర అయింది. తెలంగాణా నేల మీద పోరాటాల సంప్రదాయ వారసత్వాన్ని తన కలంతో పలికించాడు డా॥ కాసుల లింగారెడ్డి. వృత్తికి ప్రవృత్తికి మధ్య నలిగిపోతూ సాగే దోబూచులాటలో తనని తాను ఆవిష్కరించుకునే ప్రయత్నమే ! కవి హృదయం.

ఇంతుల ముద్దబంతులు, బతుకమ్మ తెలంగాణ నేల పూల కవాతు "నీకై ఒక్క అక్షరమివ్వటం కోసం ఎన్ని పుస్తకాలవుతాడో" అంటున్న ఉపాధ్యాయుడు గుండె పగిలిన దృశ్యంలో శైలజామిత్ర కవిత్వ స్పందనం పల్లెటూళ్ళో కొత్త కిటికీ తెరిచే దిశగా పయనం సాగడం పురోగమనమే అంటున్న గరిమెళ్ళ.

నేనిక్కడ అన్ని విండోలనీ మూసి పారేశాను తిరిగి నా పల్లెటూళ్ళో కొత్త కిటికీ. . . నా దేశపు గాలిని స్వాగతిస్తూ. . . కొత్త ఒరవడి కవిత్వం. బీడు భూములతో బికారీ కాలేక, వానలు లేక పైరు ఎండిపోయాక, ఉరితాడై / బతుకులు బుగ్గిపాలు కాకుండ / దగాబడ్డ గడ్డ మీది / చరిత్ర తిరగరాయ ఉద్యమిస్తే ! - చక్కని కవిత. ఆకుపచ్చని మైదానాన్ని సమస్త వృత్తుల సౌందర్య క్షేత్రాలని, ఆకాశం అంచులకు వ్రేలాడుతున్న మబ్బుల్ని చిలికే మన కళ్ళ ముందు చూపే అద్భుత కవిత్వం "ఆకు పచ్చని మైదానం" రండి పల్లెలకు పోదాం. . . పండుగలు చేసుకుందాం. . . సమస్త వృత్తుల సౌందర్య క్షేత్రాలుంటాయక్కడ. . . పలుకుబళ్ళ ముచ్చట్లు కథల తీపి రాత్రులు కాలం డొంక మీదుగా కదులుతుంటాయి. పల్లె అంటే మెత్తని గరికపూల మైదానం ఆకుపచ్చని శ్వాస ! అనుభవిస్తే గాని తెలియని నిత్య చైతన్యం ! ! ! క్రొత్త శిల్పం.

డా॥ కలువకుంట రామకృష్ణ చక్కగా చూపారు. మాటంటే పైకెగరొచ్చే ఈ మానవ మృగాల కన్నా అడవి మృగాలే నయం. తెలంగాణ పల్లె బతుకులని మాండలిక లాలిత్యంలో "నేను - నా పల్లె" రాజకీయ పోకడల మధ్య చిద్రమై పోతున్న. . . పల్లె జీవితాన్ని ఆవిష్కరించాడు అశోక్. మా వాకిలి చేతులు, ఇప్పటికి తడిమి తడిమి పునికి

పునికి చూస్తాయి తెలంగాణ పదాలు నిండాయి. ఇల్లెప్పుడూ నాలుగు పాదాలకి చేరువగా ఉండాలి. అప్పుడే ఇంటికి కళ నడిచి వస్తుంది. అనే ఏటూరి చక్కని కవిత్వానికి ప్రాణం. 'హృదయ లిపి'ని ఆవిష్కరించిన ఈ కవి వృత్తిరీత్యా జర్నలిస్టు. సమాజంలో జరిగే సంఘటనలను ఎప్పటికప్పుడు రికార్డు చేస్తూ అనుభవాన్ని అక్షరాలు అద్దే ఇతని కవిత్వంలో 'గాఢత' అమోఘం.

అమ్మ కడుపులోంచి వుమ్మ నీళ్ళు రక్తం మడుగుతోపాటు ఓ ప్రాణ పేగునీ బొడ్లో దోపుకొచ్చిన మనిషి వేలికి గుండె ఉంగరం తొడిగి చెంపలపై జారే కన్నీళ్ళనీ చేత్తో తుడిచిన మనిషి వారాలబ్బాయికి అమ్మా నాన్న తానై వెన్ను తట్టిన మనిషి నేను మనిషి కోసం వెతుక్కుంటున్నాను చక్కని వివరణ. ఎక్స్‌రే కృషికి శుభాభినందనలు. అవార్డు అందుకున్న వీరందరూ అభినందనీయులే. సంపాదకులు కొల్లూరి. సర్వదా తెలుగు తేజం. తెలుగు పత్రికల్లో ఆణిముత్యం "ఎక్స్‌రే".

*"స్పందన ! ! !*
*కవిత్వ చిత్రాలు చూపే !*
*అవే కళ్ళు ! !*
*తెలుగు సాహిత్య పాళీకేళీ విలాసాలు*
*నిజంగా ఎక్స్‌రే చిత్ర పుటలు"*



# కావ్య "మువ్వ"

వీరి కావ్యభాషలో ఈనాటి మాటలు చాలా ఉండవు. ఆనాటి మాటలు కూడా కావ్యభంగిమలో ఉంటాయి. ఆనాటి మాటలు మనకు పరాయి భాషతో సమానం. కాని కావ్యస్పర్శచేత, ఆ మాటలు కవిచేసిన కళాత్మకచయనం చేత, కర్ణపేయంగానూ మనోహరి అర్థాంతర స్ఫోరకత చేతను నినదిస్తూ ఉంటాయి. కావ్యభాషకు, మరణం లేదు వాటిని మనం పరిచయం చేసుకోవాలి. కావ్యానికి మూల్యాంకన ముఖ్యంకాదు. ఆస్వాదనకే ప్రథమస్థానం. ద్వితీయ స్థానంలో మూల్యాంకన, కవి మీద ఈర్ష్యాద్వేషాలున్న విమర్శకుడు సరాసరి మూల్యాంకన అనే ఖడ్గమెత్తుతాడు. కావ్యాన్ని ప్రప్రథమంగా రాగద్వేష రహితమైన సానుభూతి దృష్టితో చదవాలి. మహాకవి వాదననుభరిస్తాం. అవధాని కవికాడు. శ్రీ బులుసు గారి "మువ్వ" శబ్దమై చక్కని మువ్వ గోపాలునిని నాట్య మాడించింది. – కావ్యమువ్వ కవి "దేవునికై కత్తులు బట్టు భక్తులను దేవుండైన రక్షించునో" అంటూ నిర్భయగర్భమైన సంశయాన్ని వెలిబుచ్చగలిగారు. కడుపు మండుచుండ కైతలో దుఃఖించు కవి మహాకవి భవభూతి ప్రతి ధ్వనులు, శబ్ద గంభీరాలు మువ్వనాదాలుగా కవి కవితాత్మ చూపుతుంది. పరమ కావ్యరహస్యతత్వ ఫణింధమంబైన నీదు సరస కావ్యములు శారదకు స్వర్ణ పుష్పాభిషేకములు కోరి క్రొత్త పెండ్లి కూతురు సీతమ్మ కులుకులెల్ల నేర్చుకొని హసించె చక్కని వాక్యం. వీధివైపున పూచిన వేపచెట్టు ఒక్క వింజామరములోలె నొదిగి యుండు నాటి మా పల్లె అందచందాల గురుతు కవిగుర్తులకు చక్కని ఉదాహరణ అందెల రవళిలో అడుగడుగున సిరి చక్కని సినీగీతాలాపన చకిత సౌందర్య రేఖా ప్రసారిత ఘృణి ! రమ్యనిస్వార్థ భావనారామ ! రమణి !! సాగనిమ్ము విశాల పుష్పవన వీధి ప్రజలు మెచ్చినరీతి – చైత్రరథయాత్ర !! వర్ణన అమోఘం కవి అభినందనీయులు ఆంధ్రరసనాంచలముల వాహ్యాళి సేయు తేనెయూటల చినుకు – నా తెలుగు పలుకులు భాషాభిమాన్ని చాటారు కవి గారు. ప్రత్యక్షరమున భరత జాతీయ ధర్మ సుందరత తోచి దేశ సాహిత్యలతలు శాంతి పరిమళము సాహిత్యం గురించి చక్కగా వర్ణించారు కవి గారు. భయము భక్తియులేవు – నెవ్వారినైన పరిహసించుట వీరల ప్రథమ విద్య !! బులుసు గారు "ఇంతి కోర్కెతీర్ప నిక్కట్లుపడి టీ.వి. కొనియెనొకడు నాటగోలె నింట ఉడుగని తలపోటులుమ్మడి జబ్బుయ్యె" ప్రతి ఇంటా పడే బాధ కవిచమత్కారం బాగుంది.

# పక్షుల అదృశ్యం "ప్రభు" కవిత్వ పరిశోధన

సమాజంలో ముఖ్యంగా మన జీవితాల్ని గాఢంగా స్పృశించే రాజకీయమైన పరిణామాల పట్ల తెలుగు కవి అగ్రహించినంతగా, ప్రతిస్పందించినంత వేగంగా ఇతర భాషాకవులు స్పందించి ఉండరు. ఒకప్పుడు తెలుగు సాహిత్యాన్నీ, కవిత్వాన్నీ ముఖ్యంగా నిర్దేశించిన 'సామాజిక స్పృహ'లో చైతన్యం కూడా భాగమే. ఈ సాంకేతిక యుగంలో గమనించవలసిన ప్రత్యేకత. ఒక పరికరాన్ని చేయడానికి, ఒక పారిశ్రామిక వ్యవస్థని నిర్మించడానికి అనేక పరిణామదశలు దాటవలసిన అగత్యం లేదిప్పుడు. రుచీ, వాసనా లేని కూరగాయలు, వరి లాంటి పంటలు నిజమైన భూమి స్పర్శతో సంబంధం లేకుండా పండుతున్నాయి. 'పక్షులు ముఖ్యమా మనుషులు ముఖ్యమా' ఒక్కమాటలో ఆధునిక భాషలో చెప్పాలంటే మనం మన వనరుల నుంచి వేరు చెయ్యబడ్డాం. "చిటారు కొమ్మన చందమామలా ఈ గూడకొంగ గుండ్రంగా ముడుచుకొని చెట్టుకి కాసిన వెన్నెల కాయలా ఉంటుంది" కొల్లేరులో పెద్ద పెద్ద నాయకులు, వాళ్ళ దళారీలు, మత్స్యకారుల సహాయంతో చేపల చెరువులు తవ్వించి వాళ్ళకి డబ్బు రుచి చూపించారు. వలస పక్షుల్ని నిర్ధాక్షిణ్యంగా చంపేస్తున్నారు. నింగి ఒక కంప్యూటర్ గాజు పలక నీలి ధూళి నిండిన నిర్జీవపు టెడారి" భారతీయ పౌరులందరూ క్రమంగా వినియోగదారులవుతు సంతలో సంతోషిస్తున్నారు. వ్యవసాయం ఆధునికీకరణ పేరుతో భూవిధ్వంసం అనుభూతం అలవోకగా ప్రభు కళ్లలోంచి వెలువడిన కవిత్వం అందుకే ఇతను నిజమైన పర్యావరణ కవి. అనుభూతిలోంచి వచ్చేదే కవిత్వం. వార్తాపత్రికలు చదివి కోపగించుకుని రాసేది కవిత్వం అవదు. సమస్యల పట్ల మనకున్న ధర్మాగ్రహం కవుల్ని చెయ్యదు. ప్రభు రుచికరమైన కవిత్వం చెప్పగలడు. కాకినాడ కాజాలు కవిత్వంలో రుచి చూపాడు ప్రభు గ్లోబలైజేషన్ గురించి తెలుసుకోవడానికి బలహీనమైన కవిత్వం ఉపయోగించదు. కవిత్వం మన అనుభవ అనుభూతులను జాగృతం చేస్తుంది. అందోళన కలిగిస్తోన్న విషయం జాడలు లేని అల్లికలాగ, ప్రభు తన మనసుకి నచ్చిందీ. కవిత్వీకరిస్తు పోయాడు ఒకటి నుండి పద్దెనిమిది పేజీల ఆదేశంలో పిట్టలేని లోకం ఎగిరింది. భవిష్యత్తులో మరెన్ని పిట్టల కొల్లేరులులో నిర్మిస్తాడని ఆశిద్దాం చక్కని పక్షిరాజును చిత్రంగా మలచిన ప్రభువు కవిత్వం చిరంజీవి.



# నవీన కవి

పోలేపల్లి నిరంతర కవితా సృజనతో అనతి కాలంలోనే 'నవీనకవి'గా ఎదిగారు. ఆకులందున అణగిమణిగిన కవిత కోకిలవలెనే పోలేపల్లి హృద్యమైన, రసార్ద్రమైన కవితలు పలుకుతున్నారు. దేశమందభిమానం, అంతస్సూత్రంగా విశేషం. "భారతీయం". ఆయన తొలి కవితా సంపుటి మాతృదేశంలోని ప్రతి సంఘటనకు స్పందించి, సన్నివేశానికి ద్రవించి, ఆయన రచించిన కవితలిందులో వున్నాయి. గుండె చుట్టూ చూడు, గూడు ఒక చల్లని గుడి గుడిలో స్రవిస్తుంది ప్రేమామృతం అదే అమ్మ కొంగు అంటారు. పొట్టకోసం / పూట పూటా / బోళ్ళుతోమే / రాళ్ళుకొట్టే / పోరు చేసే / ముదుసలవ్వ ముదుసలికి ముదుసలే తోడు. ఇప్పటి వృద్ధాశ్రమాల కవిత. పత్తి రైతు వేదనల నుండి ప్రపంచ విజ్ఞాన వికృతిని విస్ఫోటనాలదాకా పోలేపల్లి కవితలో మనకు కన్పిస్తాయి. 'బహుభాషలకు వెలనాదేశం / భారతదేశం నా దేశం మంచి మనస్సున్న నా దేశం / స్వేచ్ఛా జీవిత ఆనందోత్సాహాలను మెలగాలి మనందరం' అన్నవి ఆయన అంతర్జాతీయతను, విశ్వశాంతి ఆకాంక్షనూ వెల్లడిస్తాయి. విలక్షణ కవి పోలేపల్లి, ఛందస్సు చీరలవెనకా, అలంకారాలమధ్యా, కఠిన పదాల బురఖాలలోనూ దాచి మోసగించాలని చూస్తే కవి కాదు, కవి ఇంజనీరు. 'సులభంగా సూటిగా చెప్పేసి ఇంత ధ్యానానికీ మౌనానికీ కార్యాలకీ విజయాలకీ వ్యవధినిచ్చే' ఓ కవి మిత్రమా ! నీ కవితలన్నీ శాశ్వతం ధన్యం నీ జీవితం. నీరు కన్నీరు – సైనికుడు, భారతీయత, అమ్మ, ముదుసలి, పుడమితల్లి ఆవేదన, కంప్యూటర్ యుగం, సంక్రాంతి, నాదేశం, దీపావళి, ప్రేమ తరంగాలు, నేస్తం ఇలా ఎన్నో వెంకటరెడ్డి కలం నుండి జాలువాలాయి. ఒక చోట – 'జాతి చూపుల పేద మొగ్గలు, పాలబుగ్గల పసిమొగ్గలు' అన్నారు. ఒక చోట – జీవితంలోను, వృత్తిరీత్యా ఆయన ఆ అనుభవంలో పేద బాలలను గురించి తను కన్నీరు కార్చారు. మెత్తటి హృదయంగల మానవతావాది వెంకటరెడ్డి. 'అమ్మఒడి' 'మట్టిబతుకులు' లాంటి ఆత్మీయభరితమైన పార్శ్వాలను గురించి రాసిన కవితలు ఇందులో వున్నాయి. మనకు మిగిలివున్న విలువలను గురించి, దేశభక్తితో కూడుకున్న అంశాలను గురించి కవితలున్నాయి. సద్విమర్శ నన్ను ముందుకు నడిపిస్తుంది. నా భవిష్యద్గమనాన్ని నిర్దేశిస్తుంది నా వెన్ను తట్టి ప్రోత్సహిస్తుంది. నాకో తెన్ను చూపిస్తుంది అని విన్నవించు కున్నారు పోలేపల్లి వెంకటరెడ్డి. కవి సహృదయతకు నిదర్శనం.

## అమూల్య దీపిక "అక్షరం నా అస్తిత్వం"

బడికెళ్లనమ్మా! వద్దంటే విన్పించుకోవు గానీ బడంటే నాకెంతో భయమేస్తోందో నీకెలా చెప్పేది? వీపుకో స్కూలు బ్యాగు భుజానికో వాటర్ బాటిలూ లంచ్ బరువుతో టంచనుగా పంపిస్తావు అక్కడ నాకసలు ఊపిరాట్టం లేదమ్మా! మన పెరటి గాలి వీచదు మన కిటికీలోంచి దూకే ఆకలేసినా దాహమేసినా గుడ్లురిమి చూసే టీచర్ చూపులకి అన్నీ అణిచేసుకునేంత భయం బండెడు పుస్తకాల మోతలతో బళ్లో ఏముందమ్మా... ప్రాణభయం తప్ప... చీకటి బస్సుకీ లంచ్ బాక్స్‌కీ చైల్డ్ కేర్ సెంటర్‌కీ మధ్య ఎన్ని నవ్వులు రాలిపోయాయో "చావుని దిద్దించే ఆ బడికన్నా హాయినిచ్చే నీ ఒళ్ళోనే చదూకుంటానమ్మా". కుంభకోణం స్కూలు అగ్ని ప్రమాదంలో ఆహుతయిన చిన్నారుల ఆర్తనాదాల స్పందన వ్యక్తి సంవేదనలు సామాజిక కంఠాన్ని వెతుకున్నాయి. ప్రగతిశీల మానవీయ భావన కవితాత్మలో లీనమవటం సమాజ చైతన్యావిష్కరణలో వెల్లువెత్తిన స్పందనలకు జీవనపోరాటమే. కవితాయాత్రలో ఆరో మజిలి. నాలోని నాదాలు 1986, గవేషణ 1992, శబ్దస్పర్శ 1996, వర్ణనిశి 2001, భవాని నానీలు 2004 ఇంతకు ముందు వచ్చాయి. ఇప్పుడు "అక్షరం నా అస్తిత్వం" కవితా సంపుటిలోని కవితలన్నీ 2001-2006ల మధ్య రాసినవి. మూడు పదుల కవిత్వం, కథలు, నాటకాలు సంగీతరూపకాలు, పాటలు, తాత్త్వికరచనలు, వ్యాసాలు, అనువాదాలు ఎన్ని ప్రక్రియలు వెలువడినా ప్రధానమైన అంతశ్చేదన కవిత్వమే! స్త్రీల జీవన సంక్లిష్టతలోంచి వ్యక్తిత్వాన్ని వెలికి తీయటం రచనల స్వభావం. పిల్లల లోకంలోకి వెళ్లటం, అమ్మతనాన్ని అర్థం చేసుకోవటం, స్త్రీ అస్తిత్వం పురుషులకి ఉపరితలంలోనే అర్థం కావటం బహుశ కవిత్వానికి ప్రేరణగా పనిచేసి ఉంటాయి. స్త్రీ సంక్షేమ కార్యక్రమాల్లో పాల్గొనటం, స్త్రీల జీవితాల్లోని చీకటికోణాలకు సంబంధించిన అంశాలపై పనిచేయటం, స్త్రీల సంఘర్షణలు, కుటుంబం, సమాజం, సంప్రదాయం, స్త్రీని ఎంతగా అణచి వేతకు గురిచేస్తున్నాయో ప్రత్యక్షంగా చూస్తున్నాం. పలు విషయాల్లో స్త్రీ ఎంతగా అవమానింపబడుతోంది అనే ఆవేదనే అక్షరానికి అగ్ని, కవిత్వంతో మనుష్యుల్ని హఠాత్తుగా మారుస్తామనే భ్రమ లేదు. రాత్రికి రాత్రి సమస్యలు పరిష్కారం కావు. అయినా కవిత్వం అమృతం కాబట్టి ఒక్కో చుక్కతో హృదయాలను తడుపుతుంటే కర్కశ హృదయాలు కూడా కరుణను వర్షిస్తాయని ఒక ఆశ. కవిత్వాన్ని ప్రేమించటం అంటే జీవితాన్ని ప్రేమించటమే. చక్కని ముఖచిత్రంతో కవిత్వ భవానీగా ఒక భద్రకాళీగా వెలసింది. కవిత్వ అస్థిత్వం తొమ్మిది కవితలు ఎనుబది రెండు పేజీలు నిండుగా నిండిన కవితాకెరటాలు. చిల్లర భవానీదేవి కవితా సంపుటి 'అక్షరం నాఅస్తిత్వం.'



## "రామనాథశాస్త్రి రామామృతం"

ఒక మహస్సు రామాయణాన్ని ఆవరించి ఉంటుంది. అది వాడి అర్హతను బట్టి ఒక్కో విధమైన పలుకు పలికిస్తుంది. ఎలాయినా అది గరీయసితత్త్వం. అంటే ఓ గొప్ప సమన్విత మహాకావ్యం రూపొందించినా, యథోచిత కావ్య రచనా పద్ధతి గల మామూలు కావ్యం రూపొందించినా, మిక్కిలి తక్కువ స్థాయి నేలబారు రచన రూపొందించినా ఒకలాంటి తృప్తి, ధన్యత కవి తప్పనిసరిగా పొందుతాడు. "అవతారం రాముడు. ఆయన ఆయనం రామాయణం. అదే సీతాయనం కూడా. అంచేత అటు నారాయాణానికీ యిటు రామాయణానికీ నారములు కేంద్రం. కాబట్టి రామకథలో ఎన్నో నదులు చోటు చేసికొన్నవి. నదులు సాక్షాత్తు రసస్వరూపాలు. పంచభూతాలలో ప్రధానమైన అస్తిత్వానికి ప్రతీకలు. ఇంకా లోతుకు వెళ్ళితే సృష్టి స్థితి లయ కేంద్రాలు. కనుకనే నారాయణ తత్త్వాన్ని వ్యాఖ్యానించడానికి వానికి గల అర్హత అనన్యము - రామకథా దర్శనంలో యిదొక క్రొత్త కోణంగా దర్శించి ప్రదర్శించడానికి రసరమ్య కేంద్రాలు. ఆ దృష్టితో రామకథని నాటకీయంగా భావ ప్రధానంగా దర్శించి ప్రదర్శించే ప్రయత్నం చేశాను. మహోన్నత ధర్మ ప్రస్థానంగా సాగివచ్చిన రామాయణంలో మానవతను ఒక క్రొత్త కోణంతో దర్శించాను. పాత్రలు, వాని మనోభావాలు, వాని చేత సాధించదగిన రసభావాలు, సాముదాయికంగా వ్యవస్థ. ఇది రచనకి సంబంధించిన అంశం గనుక మరికొన్ని సంగతులు మనవి చేయాలి. వీలైనంత వరకు నియమబద్ధమైన మాత్రా ఛందస్సు వాడాను. భాష వీలైనంత తేలికగానే నడిపిస్తూ, అవసరాన్ని బట్టి ఎక్కడో సమాసాలను వాడుకచేస్తూ అసిధారావ్రతంగానే నడిచాను. భావుకత, శైలి మొదలైన సాహిత్య విమర్శక ప్రమాణాలను వీలైనంతగా పాటిస్తూ క్వాచిత్కంగా ఆయా విషయాలలో స్వేచ్ఛ ఉంది. ఆర్షకృతులకు జీవగర్ర అయిన వేదార్థ దర్శనాన్ని గూర్చి కొంత వివేచన మహాకవుల రచనలోను ఒక వేదార్థము, ఒక ధర్మప్రస్థానము ధ్వనిస్తుంటుంది. చమత్కారస్థాయి ధ్వని కాదు ఆలంకారికులు వివిధ ధ్వని ప్రస్థానాలను ప్రతిపాదించారు. యువతి పాంధునితో నీవు వైద్యుడవయితే కనులు లేక యింట్లో

ఒక్కతే పడుకొని యున్న మా అత్తగారికి దృష్టి యెప్పుడు వస్తుందో, చెప్పగలవా? జ్యోతిష్కుడవైతే ప్రవాసియై బహుకాలంగా యింటికి రాని నా భర్త యెప్పుడు తిరిగివస్తాడో చెప్పగలవా? వస్తు, రసాది ధ్వని మార్గాలలో ఒకానొక వ్యంగ్య రచనకి యుగయుగాలుగా కవులు ప్రయత్నిస్తున్నా రదనంలో రమ్యశృంగారాద్యర్థాలను వ్యంగ్యంగా స్ఫురింపజేస్తే సరి. లేదా గుణీభూత స్థాయిలోనైనా వాని వినియోగము, ఆదరణ వేఱు, ఇక్కడ కాదు. ఒకవేళ సరియైన అవగాహనము వినియోగము జరుగకపోతే ఓ నీతి కావ్యంగానో వేదాంత ప్రవచనంగానో నిలిచిపోతుంది. వేదార్థ ధర్మార్థ ధ్వనిమార్గం అసిధారావ్రతమనీ ఏ మాత్రం అటూయిటూ అయినా పైన చెప్పిన తేడా వస్తుంది. కథలో, రచనా విధిలో వేదార్థ ధ్వనిలోనా సాఫల్యవైఫల్యాలు గల – అయోధ్య – అరణ్యకాండలు సమర్పిస్తున్నాను. రామమహస్సుకీ వాల్మీకి తపస్సుకీ ధారాశాస్త్రి రామామృతం. కలిమి లేముల కష్టసుఖముల కలిసి నాతో తాను నడిచెను కలిమ లేముల కష్టసుఖముల తనతో కలిసి నడిచితి. కేవలము నా మనసు ముచ్చట జానకీ హృదయాభిరాముడు". ఇది ధారా రామానాథశాస్త్రి గారి రామామృత వీచిక.



# తెలంగాణాలో శ్రీలేఖ సాహితి పక్షాన రాష్ట్రస్థాయి శతాధిక కవి సమ్మేళనము

వరంగల్లులోని ప్రముఖ సాహిత్య సంస్థ శ్రీలేఖ సాహితి 29-01-2006న సంస్థ త్రిదశాబ్ది ఉత్సవాలలో ప్రారంభ సమావేశముగా రాష్ట్ర స్థాయి శతాధిక కవి సమ్మేళనమును నిర్వహించినది. ఈ కవి సమ్మేళనములో రాష్ట్రంలోని 20 జిల్లాలకు చెందిన కవుల ప్రాతినిధ్యముతో పాటు చెన్నయ్, ఖరగ్‌పూర్, ఢిల్లీ నుండి కవులు హాజరు అయినారు. వరంగల్లు సాహిత్య చరిత్రలో ఇదొక అపూర్వ సంఘటన, సువర్ణాక్షరాలతో లిఖించదగిన అంశము అని పాల్గొన్న ప్రముఖులు అన్నారు.

ప్రారంభ సమావేశమును ప్రారంభిస్తూ సంస్థ అధ్యక్షులు డా॥ టి. శ్రీరంగస్వామి గారు ఈ కవి సమ్మేళనము కవితామతల్లికి కవితాభిషేకము చేయడమంటూ, అభిషేకమనగానే 108 సంఖ్య గుర్తుకు వస్తుంది. కానిక్కడ 130 మంది కవులు తమ కవితతో అభిషేకము చేయడానికి రావడం గమనించదగిన విషయమన్నారు. ఈ కవి సమ్మేళనములో ఔత్సాహిక, వర్ధమాన కవులలతో పాటు లబ్ధ ప్రతిష్టులైన పలువురు కవులు పాల్గొనడం విశేషమన్నారు. ఇతర జిల్లాల్లోని సాహిత్య సంస్థల అధ్యక్షులు, ప్రముఖులు ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు, కవితాసాంద్రతను కాపాడుతూ, కవిత్వం పై గౌరవాన్ని ఇనుమడింపచేసే విధముగా కవుల తమ రచనలను అందించాలని చెప్పారు. శ్రీ సుప్రసన్న గారు మాట్లాడుతూ కవులు సామాజిక సమస్యలపై సరైన రీతిలో స్పందించి సమాజమును మార్గనిర్దేశ్యము చేయాలని అన్నారు.

శ్రీ పోల్లేపల్లి వెంకటరెడ్డి గారి "భారతీయం" కవితా సంపుటిని ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు, కవితా భరద్వాజ సమీక్షా వ్యాస సంపుటి "దర్శన"ను డా. బన్న అయిలయ్య, శ్రీలేఖ సాహితి వెలువరించిన "వరంగల్లు సాహితీ మూర్తులు" పుస్తకాన్ని శ్రీ కె.యస్.ఆర్.జి. ప్రసాద్ గారు, డా. ఆశావాది ప్రకాశరావు గారి "అంతరంగ తరాంగాలు" పుస్తకాన్ని ఆచార్య శ్రీపెరంబూదూరు లక్ష్మణమూర్తి గారు, వడలి రాధాకృష్ణ గారి "జలఖడ్గం" కవితా సంపుటిని శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు గారు, శ్రీమతి

వడ్డాది లక్ష్మీసుభద్ర అనుసృజించిన డా॥ శ్రీరంగస్వామి గారి "నీలమోహనాష్టకము"ను కోవెల సుప్రసన్నాచార్యులు గారు ఆవిష్కరించారు.

ఈ సమావేశములో వి.పి. చందన్‌రావు నిజామాబాద్, మాల్యశ్రీ భద్రాచలం, ఐతా చంద్రయ్య (సిద్ధిపేట), చలపాక ప్రకాశ్ (విజయవాడ) పొన్నూరు వెంకట శ్రీనివాసులు (ఒంగోలు), ఏ. సూర్యప్రకాశ్ (నిజామాబాద్), డి. శ్రీనివాస దీక్షితులు (నరసారావుపేట గుంటూరు), ముదుంబై వరదాచార్యులు (నర్సంపేట), ఎస్.వి. కృష్ణ (హైద్రాబాద్), డా॥ ఆశావాది (అనంతపురం), డా॥ పేర్వారం జగన్నాథం గారలు ముఖ్య అతిథులుగా పాల్గొనగా, స్థానిక ప్రముఖ కవులు డా॥ పల్లేరు వీరస్వామి, నమిలికొండ డా॥ ఎల్.యస్.ఆర్. ప్రసాద్, అనిశెట్టి రజిత, వరిగొండ కాంతారావు, డా॥ కె.ఎల్.వి. ప్రసాద్, పల్లేనీను, బాసిరి సాంబశివరావు, డా॥ వి. వీరాచారి, పోలేపల్లి వెంకటరెడ్డి గారలు సభాధ్యక్షత బాధ్యతలను నిర్వహించినారు.

ఈ సమావేశములో నిజామాబాదు నుండి 12 గురు, కరీంనగర్ నుండి ఆరుగురు ఖమ్మం నుండి ఎనమండుగురు, సిద్ధిపేట నుండి నలుగురు, విజయవాడ నుండి ఆరుగురు, ఒంగోలు నుండి నలుగురు, గుంటూరు ఇతర జిల్లాల నుండి ఇద్దరు చొప్పున పాల్గొనగా, స్థానికులు అనేకులు పాల్గొనినారు.



## ఐతా చంద్రయ్య నానీ అక్షరాంజలి

శ్రీలు పొంగిన కోట చిన్నయాత్మల వేట  
కళల పూదోట మా సిద్ధిపేట.

తెలుగు సాహితీ కళామతల్లికి కంఠహారముగా అలంకరించారు ప్రముఖ సాహితీ వేత్త గోపిగారు. నానీల కుటుంబములో చేరాలనుకోగానే ఆప్యాయంగా స్వాగతం పలికి, "గుండె చప్పుళ్ళు"ను ఆలకించి "పల్స్‌రేట్" పీఠికతో వెన్ను తట్టిన సాహితీ సంపన్నులు ఆచార్య గోపిగారు. నానీల ప్రవాహము సామాన్యులు అసామాన్యులను అలరిస్తోంది.

ఏ భావానికైనా భవ్యమైన ఆకృతి కల్పించగల కళా ప్రపూర్ణ డా॥ కాపు రాజయ్య గారు "గుండె చప్పుళ్ళు"కు కూడా ఓ ఆకృతి కల్పించారు.

ఐతా చంద్రయ్య సీనియర్ రచయిత అర్థశతాధిక గ్రంథాలను రచించారు. తెలంగాణలో సిద్ధిపేటకు ప్రత్యేక స్థానముంది. ఎందరో కవులు, రచయితలు, చిత్రకారులు ఈ గడ్డను పునీతం చేశారు. శిఖర ప్రాయులైన వేముగంటి, కాపు – రాజయ్యల కార్యక్షేత్రం సిద్ధిపేటనే. తెలంగాణా ప్రాంతములో పలువురు సాహిత్యకారులను ఈ పరిమితి పీడించిందని ఊహ.

ఐతాచంద్రయ్య గారు జాతీయ భావ సంపన్నుడని తెలుస్తుంది. దేశభక్తి మెండు. జీవన దృక్కోణమేదయినా చెప్పేదానిలో కవిత్వం పండాలని నా వాదన. మొదటి నానీలోనే చంద్రయ్య గారు ఆ పని చేశారు.

సూర్యుడు సముద్రంలో మునిగాడు ఇక వెన్నెల రూపంలో వేడి.

కానీ వేడిగా కాదు. వెన్నెలగా మార్చి అందించాయి. సజ్జనుడు తాను కష్టాలను అనుభవించిన ఇతరులకు సుఖాలనే ఇస్తాడని సారాంశం.

దేవుడున్నాడా కన్పించడేమిటి?  
గాలి సంగతి ఏమిటి సారూ !  
వర్తమానం సమస్యలకు గచ్ఛద్వాఖ్యాతగా నిలబడతాడు.

స్వచ్ఛమైన పాలన సర్కారు ధ్యేయం
ఈ ఏడాది జోకు ఇదే మరి !
అద్దానికి అర్థం ఎందుకు? టీ.వి. సీరియళ్ళను వదల్లేదీయన.
అమ్మకథకు అవార్డులు అమ్మకు చీవాట్లు
ఇదండి అమ్మ ప్రేమ.

కవయిత్రి ఓ కవితలో 'అమ్మ గురించి కవిత్వం రాయకండి మిత్రులారా ! మీకు కావలసింది చిన్నప్పటి అమ్మ. అమ్మను దేవతను చేయకండి. మనిషిగా చూస్తే చాలు" అని అంటుంది. రాజకీయాల పట్ల చక్కని అవగాహన, ఆధ్యాత్మిక జ్ఞానం, సంస్కృతిపై మమకారం, మానవత్వం కోసం ఆరాటం మొదలైన అంశాలన్నీ కవి గుండె చప్పుళ్ళుగా మారాయి.



# ఐతా చంద్రయ్య నానీ అక్షరాంజలి

శ్రీలు పొంగిన కోట చిన్నయాత్మల వేట
కళల పూదోట మా సిద్ధిపేట.

తెలుగు సాహితీ కళామతల్లికి కంఠహారముగా అలంకరించారు ప్రముఖ సాహితీ వేత్త గోపిగారు. నానీల కుటుంబములో చేరాలనుకోగానే ఆప్యాయంగా స్వాగతం పలికి, "గుండె చప్పుళ్ళు"ను అలకించి "పల్స్‌రేట్" పీఠికతో వెన్ను తట్టిన సాహితీ సంపన్నులు ఆచార్య గోపిగారు. నానీల ప్రవాహము సామాన్యులు అసామాన్యులను అలరిస్తోంది.

ఏ భావానికైనా భవ్యమైన ఆకృతి కల్పించగల కళా ప్రపూర్ణ డా॥ కాపు రాజయ్య గారు "గుండె చప్పుళ్ళు"కు కూడా ఓ ఆకృతి కల్పించారు.

ఐతా చంద్రయ్య సీనియర్ రచయిత అర్థశతాధిక గ్రంథాలను రచించారు. తెలంగాణలో సిద్ధిపేటకు ప్రత్యేక స్థానముంది. ఎందరో కవులు, రచయితలు, చిత్రకారులు ఈ గడ్డను పునీతం చేశారు. శిఖర ప్రాయులైన వేముగంటి, కాపు – రాజయ్యల కార్యక్షేత్రం సిద్ధిపేటనే. తెలంగాణా ప్రాంతములో పలువురు సాహిత్యకారులను ఈ పరిమితి పీడించిందని ఊహ.

ఐతాచంద్రయ్య గారు జాతీయ భావ సంపన్నుడని తెలుస్తుంది. దేశభక్తి మెండు. జీవన దృక్కోణమేదయినా చెప్పేదానిలో కవిత్వం పండాలని నా వాదన. మొదటి నానీలోనే చంద్రయ్య గారు ఆ పని చేశారు.

సూర్యుడు సముద్రంలో మునిగాడు ఇక వెన్నెల రూపంలో వేడి.

కానీ వేడిగా కాదు. వెన్నెలగా మార్చి అందించాయి. సజ్జనుడు తాను కష్టాలను అనుభవించిన ఇతరులకు సుఖాలనే ఇస్తాడని సారాంశం.

దేవుడున్నాడా కన్పించడేమిటి?
గాలి సంగతి ఏమిటి సారూ !
వర్తమానం సమస్యలకు గచ్ఛద్వ్యాఖ్యాతగా నిలబడతాడు.

స్వచ్ఛమైన పాలన సర్కారు ధ్యేయం
ఈ ఏడాది జోకు ఇదే మరి !
అర్థానికి అర్థం ఎందుకు? టీ.వి. సీరియళ్ళను వదల్లేదీయన.
అమ్మకథకు అవార్డులు అమ్మకు చీవాట్లు
ఇదండి అమ్మ ప్రేమ.

కవయిత్రి ఓ కవితలో 'అమ్మ గురించి కవిత్వం రాయకండి మిత్రులారా ! మీకు కావలసింది చిన్నప్పటి అమ్మ. అమ్మను దేవతను చేయకండి. మనిషిగా చూస్తే చాలు" అని అంటుంది. రాజకీయాల పట్ల చక్కని అవగాహన, ఆధ్యాత్మిక జ్ఞానం, సంస్కృతిపై మమకారం, మానవత్వం కోసం ఆరాటం మొదలైన అంశాలన్నీ కవి గుండె చప్పుళ్ళుగా మారాయి.



# కందుకూరి లక్ష్మణమూర్తి "ఆలోచన ధార"

కవిత్వం జీవితాన్ని కళోద్యానంగా దిద్దుతుంది. మనస్సు మీద చీకటి మరకలు పడనీయదు. పరిణామాలు అనేకంగా దూసుకొచ్చినప్పటికీ సమాజం పవిత్రతను కాపాడుతుంది. మానవత్వం నుంచి ఎగిసొచ్చిన నవత్వం మనిషి హృదయాన్ని మందిరం చేస్తుంది. నవత్వం నుంచి వెలువడిన మానవత్వం జాతిని నిలబెడుతుంది. యువకవి శ్రీ కందుకూరి లక్ష్మణమూర్తి ప్రచురిస్తున్న ఈ కందుకూరి కవితామాలికలు కవితలు నవ్యంగా ఉన్నాయి. మానవత్వం భూమికగా ఉదాత్తంగా ఉజ్వలితంగా ఉన్నాయి. ఆయన కవితల్లో దైవం, దేశీయం, జాతీయం, సంస్కరణం, మానవత్వం కారుణ్యం వంటి మేలిమి సాహిత్య సుగుణాలున్నాయి. మూర్తి కవి భావశిల్పి, సమస్యలు, సంఘర్షణలు, సన్నివేశాలు హృదయాన్ని కదలించినప్పుడు మాత్రమే కవితరాసే ఆశయం ఉన్నవాడు. ఆయన కవితలో వర్తమానమే చరిత్రగా కన్పిస్తుంది. తొలి కవితలో చదువుల తల్లిని ఆరాధించి మలికవిలో మానవత్వాన్ని అద్భుతంగా వర్ణించాడు.

స్వార్థ చింతనలేని తత్త్వం
మాతాతీతం మానవత్వం
వర్గభేదం లేని తత్త్వం
బీదసాదలెరుగని తత్త్వం
ధనాతీతం మానవత్వం
అక్షరం అందించు అనంతజ్ఞానం
అక్షరం అవనిలో వెలసిన అమృతభాండం

ప్రతి పాఠకుడు కూడా చదవలసిన కవితలే. రాశిలో వాసిలోనూ మూర్తి కవితలు సమాజ ప్రయోజనాన్ని రాసినవనే చెప్పాలి. లక్ష్మణ కవి సమస్యలను తీసుకొని కవితగా రాయటమే కాక వాటికి పరిష్కారాలను, సూచించే తత్త్వం ఉన్న దార్శనిక కవి. సమస్యలూ, సంఘర్షణలూ ఉత్పన్నం కావడానికి ఉన్న ప్రేరణల స్వరూప స్వభావాలను ఆయన ప్రమాణికంగా పసిగడతాడు. అధ్యయన శీలి. సమాజంలో వస్తున్న సాహిత్యంలో వీస్తున్న పరిణామాలను స్పష్టంగా దర్శించి విజ్ఞాన కోశంలాంటి సాహిత్యాన్ని సృజించడంలో చక్కని నిపుణతతో వెలువరించిన కవితా ప్రవాహం చక్కని చిక్కని భాషా ప్రయోగం.

# బన్న అయిలయ్య "కీర్తి కిరణాలు"

డా॥ బన్న అయిలయ్యకు రెండు దశాబ్దాల సాహిత్య జీవితముంది. ఈయన మొదట కవి, తర్వాత విమర్శకుడు. రహస్య చిత్రం, నిప్పుకణిక అని కవిత్వ సంపుటాలను ప్రచురించిన అయిలయ్య తెలుగు కవిత అభినవ దృక్పథం, తెలంగాణా సాహిత్య సాంస్కృతిక చైతన్యం – అనే విమర్శ గ్రంథాలను ప్రచురించారు. ఈ సాహిత్య కిరణాలను ప్రసరిస్తున్నారు. మహాభారతం నుండి కాలువ మల్లయ్య దాకా ఎనిమిది ప్రముఖ సాహిత్యాంశాలను విశ్లేషించారు అయిలయ్య. వర్ణమూలాల అన్వేషణ సామాజిక ఉద్యమాలు సాహిత్యం మీదనే కాక, సాహిత్య విమర్శ మీద కూడా ప్రభావం చూపిస్తాయనడానికి ఈ వ్యాసం నిదర్శనం. జాషువా 'నా కథ' కేవలం ఆయన వ్యక్తిగత జీవిత చరిత్రగా కాక, ఒక జాతి కథగా కనిపిస్తుందనడం బాగుంది. 'అనాథ' కావ్యం మీద ఆకలి ముప్పెల ప్రభావాన్ని గుర్తించడం అయిలయ్య చారిత్రక దృష్టికి గుర్తు. కుందుర్తి వర్తమాన చరిత్రను క్లాసిక్‌గా మలచడానికి కథాకావ్య రచన చేశారన్నారు. వచన కవిత్వం ఉద్యమస్థాయికి ఎదిగిన సంస్కృతి భాషా ప్రాబల్యం దానికి తోడు పాశ్చాత్య సంప్రదాయంలోని అస్పష్టత కలిసి కవిత్వాన్ని సామాన్యుడికి దూరంగా ఉంచే ప్రమాదాన్ని కుందుర్తి కథాకావ్య రచన ద్వారా తప్పించే ప్రయత్నం చేసారనడం కొత్తగానే ఉంది. "స్త్రీలు చైతన్యవంతులై సమానత్వం కోసం పోరాడాలని గురజాడ భావించారు" అని గుర్తించి గురజాడ వాక్యాలనీ ఉదాహరించాడు. చిత్రించిన స్త్రీ పురుష సంబంధాల పరిశీలన కీర్తి కిరణాలు. "స్వాతంత్ర్యోద్యమ చరిత్ర – తెలుగు కావ్యాలు" అనే వ్యాసం శ్రీ అయిలయ్య విమర్శలోని లోతులను తెలియజేస్తుంది. కావ్యాల విశ్లేషణ ఈ వ్యాసం. సుధీర్ఘమైన చర్చ తర్వాత "కాలమే వాటికి జన్మనిచ్చింది" మల్లయ్య నవలలన్నీ కలిసి 1940–1999 మధ్య తెలుంగాణా సామాజిక జీవన చరిత్రను అవగతం చేస్తాయి అన్న అవగాహనతో అయిలయ్య రాసిన ఈ వ్యాసం సిద్ధాంత పత్రమే. రచయిత సాహిత్యంలోని ఒక ప్రక్రియను ఎలా అంచనా కట్టాలో రుజువు చేస్తుంది. అయిలయ్య అధ్యయనంలోని విస్తృతికి కూడా ఈ వ్యాసం నిదర్శనం. సుగుణం కొంత మంది విమర్శకులు చాలా శ్రమించి విమర్శ రాస్తారు. స్పష్టత కొరవడుతుంది. కొందరు స్పష్టంగా రాస్తారు. శ్రమలోపం కనిపిస్తుంది. శ్రమ స్పష్టత సమన్వయం పొందిన విమర్శకులు మరికొందరు అయిలయ్య అలాంటి వారిలో ఒకరు.



# 'ఉపదేశ ఉపనిషత్తులు'

మనిషి ఆధ్యాత్మిక చింతన, సత్ ప్రవర్తన మరియు మోక్షమునకు మార్గము చూపుటకు గాను రచనలు శ్రీవిష్ణు సహస్రనామ బోధామృతలహరి, శంకర బోధామృతలహరి, శ్రీ శివసహస్రనామ బోధామృతలహరి నారద బోధామృతలహరి, లలితా సహస్రనామ బోధామృతలహరి, ప్రచురించి అందించాడు. తేనెవలె మధురముగా రచించును. బ్రహ్మము, పరమాత్మ సర్వప్రాణుల యందు వలదు అనుసత్యమును సువర్ణమంత్రాలు తెలుపుచున్నది. గీతా, యోగశాస్త్ర, మంత్ర, తంత్ర, సూక్త, స్తవరాజం, బోధామృతలహరులు. జాగృత పరచుచున్న, మేధాసంపద అంటే జ్ఞాన అనుభవాల మేలు కలయిక. వస్తువుల సారాన్ని దర్శించటం. మేధావిత్వంలోకి వచ్చే విషయాలు. పరస్పర సంబంధము గల విభాగాంశాల సంపూర్ణత్వం గల మేధావిత్వం లోకి వచ్చే విషయాలు. విశ్వాన్నంతా ఒక మొత్తముగా రూపొందిస్తున్నది. ఆ విశ్వచైతన్యం మీలో నాలో అన్నింటిలో లోపల 'ఉన్నది'. ద్వారా గుర్తించవచ్చు. భక్తి, కర్మ, జ్ఞాన, ధ్యాన మార్గాలు నాల్గింటి ద్వారా తీవ్ర ప్రయత్నం చేయటమే 'సాధన', ఉపనిషత్తుల రహస్యం, దివ్యత్వము, పూర్ణము. పూర్ణము నుండి ఆవిర్భవించగా మిగిలేది పూర్ణమే. అభ్యున్నతి, పెరుగుదల, వికాసము, సంపన్నత, అనేవి ఇమిడి ఉంటాయి. ఋగ్వేదానికి సంబంధించిన ఐతరేమోష నిషత్తులోనిదే. "దేవుడెక్కడ"? ప్రతి వస్తువులో, జీవితస్వరూపంలోని ప్రతి అణువులో ఉన్న చేతనమే శక్తి లేక స్పందనమే, ఆచరణమైన బ్రహ్మము సర్వభూతాలలో ఉన్న ఆత్మయే దైవము. బ్రతుకే దైవము. అప్పుడు మనకొక సమీకరణ ఆత్మ = బ్రహ్మము అనేది ఏర్పడుతుంది. ఆదిశంకరాచార్యులు జీవుడు = శివుడు అని ప్రకటించారు. ప్రతిక్రిమిలో, కీటకంలో, పక్షిలో, పశువులో సర్వమానవులలో దర్శిస్తాం. 'సాక్షాత్కార రహస్యం' దైవం అన్నియెడలా, అందరిలో దివ్యజ్యోతిని "బృహరణ్య కోపనిషత్తు" లోనిది. మనందరిలో ఉన్న నేను తనాన్ని దివ్యత్వంలో అనుసంధానం చేస్తున్న తైదారీయోపనిషత్తులో వరుణుడు, భృగువు అనే తండ్రి కొడుకులు గురుశిష్యులు. అందులో వరుణుడు భృగువునకు తపస్సును అధ్యయన మార్గంగా సూచిస్తాడు. కఠపనిషత్తులో విద్యార్థి నచికేతుడు యముని గురువుగా పట్టుకొని విద్యను ప్రార్థిస్తాడు.

ప్రశ్నోపనిషత్తులో ఆరుగురు ముముక్షు శిష్యులు పిప్పలాద మహర్షిని మానవతామూలాన్ని, జీవితపు సాధనలను, జీవితసరళిని, ఆత్మతత్వాన్ని, ధ్యానాన్ని సంపూర్ణ వ్యక్తిత్వాన్ని గురించి ఆరు ప్రశ్నల నడిగి అంతర్దర్శనంలో సమాధానాలు పొందుతారు. మండూకోపనిషత్తులో 12 మంత్రాలు అక్షరతత్వ విషయాల చతుర్విధ ప్రకృతి ఇందులో విశదం చేయబడింది. అమృత బిందు మనస్సు పరివర్తనానికి ఎలా కీలకమో నొక్కింది. మహర్షి యాజ్ఞవల్క్యుడు సహాధ్యాయులను పెక్కుమందిని చర్చలో పాల్గొన జేసి జ్ఞానశక్తిని నిరూపిస్తాడు. ఈశావాస్యోపనిషత్తు, కేనోపనిషత్తు, కఠోపనిషత్తు ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు మాండూకోనిషత్తు, తైత్తిరీయోపనిషత్తు ఐతరేయోపనిషత్తు, చాందాగోప్యనిషత్తు, బృహదారణ్యకోపనిషత్తు, ముక్తికోపనిషత్తు 108 ఉపనిషత్తుల పట్టికను చూపుతున్నది. 27 జ్యోతిర్మయి వాక్యాలను అవి శాశ్వత మూలాధారాలు, పశుపక్ష్యాదుల జీవితం తరువాత మానవ జీవితం ఏర్పడింది. పరమజీవనం కలుగుతుంది. విశ్వజీవులతో లోపలి జీవులతో వ్యవహరించే స్థితి ఉన్నది. ఆకాశంలో ప్రతి వ్యవధానమూ అనేవి చైతన్య స్పందనలకు మూలాధారాలు, వృక్ష జీవనం పెరుగుతూ ఉంటుంది వికాసం పొందుతుంది.

పంచభూతాల సంసర్గాన్ని హాయిగా అనుభవిస్తూ ఉంటుంది. మానవీయ జీవితం భౌతిక, జ్ఞానాలతోపాటు ఆంతరంగిక జ్ఞానంలో అంతః ప్రపంచ సంబంధంలో అంతర్నాదంలో అది స్పృశిస్తుంది. ఈ ఉత్ప్రేరణ స్వీయ అభివృద్ధికి, సౌభాగ్యానికి ఆత్మపరిపూర్ణతకు, ఆత్మసాక్షాత్కారానికి మూలం. వృక్ష జీవనం సహజస్థాయితో మేల్కొంటుంది. దివ్య జీవనం సహజము, ఊహాత్మకమూ, బుద్ధి సంపన్నమూ, ఉత్తేజమూ అయిన స్థాయిలో మేల్కొని జాగరూకమై ఎఱుక కలిగి స్మృతి సంకలితమై ఉంటుంది. భౌతిక చైతన్యానికి ఉష్ణోగ్రత సూర్యక్రాంతి వేడి, శక్తి. ఆకాశంలో వ్యాపకత, భూమి గట్టితనం, ఖనిజములు, కర్బనం ప్రాణవాయువు ఈ సర్వచైతన్యాలను ఆవరించి ఉన్న విశ్వచైతన్యం. సర్వజీవుల సర్వవస్తువుల దురంధరత్వాన్ని (బాధ్యతను) వహిస్తూ ఉంటుంది. సర్వజన భద్రతా వహనానికి ప్రతీకలు. శ్రీ వేదవ్యాసులు, మహర్షి పతంజలి, గౌతమ బుద్ధుడు, జీసస్ క్రీస్తు, పైగంబర్, మహమ్మద్, ఆదిశంకరాచార్యులు, గురునానక్, నిజాముద్దీన్, క్రిష్ట, సాయిబాబా, రాజారామోహనరాయ్, స్వామివివేకానంద, అరవిందులు, మహాత్మాగాంధీ, సి.సి. ప్రాష్, స్వామి రామతీర్థ రమణమహాఋషి మదర్‌థెరిసా ఇంకా



సేవ సంస్థలు ఎన్నో సత్యం పలుకు, ధర్మము నాచరించు, తల్లి నీకు దైవము అగుగాక! తండ్రి దైవం అగుగాక ! ఆచార్యుడు దైవం అగుగాక ! అతిథి దైవం అగుగాక దోషం లేని పనులను మాత్రమే నీవు ఆదరంతో ఆచరించు. శ్రద్ధతో దానం చేయాలి. శ్రద్ద లేకుండా ఇవ్వరాదు. మంచిని ఇవ్వు. సిగ్గుపడుతూ వినయంతో ఇవ్వు, భయపడుతూ ఇవ్వు సదుద్దేశంలో స్నేహంతో ఇవ్వు. నీవు ప్రవర్తించు, ఉపదేశం వేదాల రహస్యం, ఇంద్రియాలను గుఱ్ఱాలను అదుపు చేసి బుద్ధి మనసునే పగ్గం గల దేహరథము సురక్షితమూ, అర్థవంతమూ అయిన జీవన ప్రయాణం సాగిస్తుంది.

ఓమ్ సహనావవతు, సహనౌభునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వీనావధీత మస్తు
మావిద్వైతషావహై
ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

పరమాత్మ మనయిద్దరిని కలిపి రక్షించుగాక
మనం ఒకరికొకరు అవలంబనాత్మకంగా ఉందాం
మనం కలిసి కార్యం నిర్వహిద్దాం
మన అధ్యయనం కాంతిమంతం అగుగాక
మన యిద్దరి నడుమ ప్రశాంతత ఏర్పడుగాక
ఓం శాంతి, శాంతి, శాంతి

నాటి పాఠశాల ప్రార్థనలు. ఈ యజుర్వేద సారాంశం. మానవులందరి ప్రార్థన గీత, ఖురాన్, బైబిల్ అయిన ఒక్కటే. ప్రతి మానవునిలో ఉంటుంది. గురువులు, తల్లిదండ్రులు, ఋషులు, యోగులు, తెల్పుసారాంశం 'ఉపనిషత్తులు' శ్రీరఘునాధశర్మ అక్షరకృషి శ్రీ గురుజీ శ్రీ నారాయణ గారి సీతారాంఃసదన్ మంత్రపురి వారి ఆవిష్కరణ గ్రంథం.

## 'చిన్న చినుకులు – జల్లు మినీ గేయమాలిక'

చిన్న చినుకులులాగే అనిపించినా ఘనమైన వర్షంతో ఉరుములు ఉరిమి మెరిసి తుఫానులై ప్రకృతిని గడగడలాడించే గర్జనల అద్భుతశక్తి ! మిని కవితల శిల్పం స్పష్టంగా సూటిగా కొత్తగా ఉండి ఉద్యమ లక్ష్యంను చాటి అణువనువునా విశ్వాసంను పెంచుతుంది. అలంకారంగా, లబ్దిని కూర్చే ప్రశంసమై కీర్తి చంద్రికలలో కలకాలం మన్నికయై పేరెన్నికయై స్థిరఖ్యాతులతో ఆ చంద్ర వెలుగుతుందనడంలో సందేహం లేదు. ఈ మినీ కవితల సంకలనంకు కవి హృదయం ఎప్పుడు నివురుగప్పిన నిప్పులాంటిది! చల్లని హాయినిచ్చి ఆహ్లాదపరుస్తాయి. శ్వాసనిండా విశ్వాసం నింపుతాయి అలాంటి మిని కవితలను మనమెప్పుడూ చిన్నచూపు చూడకూడదు. అణువణువే సింధువై మహా ప్రవాహమవుతుంది. జగత్ కళ్యాణం కోసం వినియోగపరుచుకునే మన మంచి నడువడుల తార్కాణంగా నిలిచే మినీ కవితల దర్పణం స్వచ్ఛత, స్వేచ్ఛత ప్రతిబింబం, నిలువుటద్దంలా చూసుకునే చక్కని ప్రక్రియలే ఈ మినీ కవితలు. కవులు, రచయితలు, తెలుగులో ఏ రచనా ప్రక్రియను చేపట్టినా సామాజిక స్పృహ, ప్రబోధం, భక్తి తెలుగు భాషా వైభవంగా నైతిక అంశాన్ని ఏది స్పృహించినా కవిత్వం అశువుగా వస్తుందనుటలో అతిశయోక్తి ఇసుమంతయు లేదు. కనుమరుగైపోతున్న తెలుగుభాషను, సంస్కృతిని సాంప్రదాయాలను వివిధ సాహిత్య ప్రతిమల్లో అక్షర నిక్షిప్తం చేస్తూ అనేక సాహిత్య సాహితీలోకానికి పరిచయం చేస్తున్న తెలుగుభాషా సంరక్షకులు, నానీల, చిరు కవితలు కూడా అవగాహనలోగానీ, సలక్షణాల్లోగానీ, స్పష్టత వుండే సందేశం నింపి భావ ప్రకటనలు చేస్తాయి. సమర్థవంతమైన అక్షరాల కూర్పు నేర్పులతో చిరుపదాలతో అర్థవంతమైన సమర్థవంతంగా నిరూపించారు. నానీల లక్షణం లక్ష్యసాధనతో కృతకృత్యులైనారు.

'కవి తిలక' బిరుదుతో తిరునగరి సత్కారం పొందడం వీక్షించడం మరుపురాని సంఘటన మానవతా ధర్మంగా భావించి, ఈ మిన్నయైన విషయంగా నా వ్యక్తిత్వపరంగా మంచి హితరచనలు, సన్నిహితునిగా ఆహ్వానిస్తున్నాను మంచి పవిత్ర జలాలు అందరికీ అందుబాటులో వుంటే మనందరికీ పుణ్యం, ధన్యం అని అభిలాషతో "పసలేనివారు ఎందుకూ పనికిరారు. విషయ పరిజ్ఞానంతో ఆపత్‌బాంధవులై నిలిస్తే అజేయంగా కనిపిస్తారు. అసభ్య ప్రవర్తనలు సభ్య సమాజంలో సహజంగా కొనసాగిస్తుంటే సమాజంలో మానవత్వం జీవిస్తుందా ! తెలంగాణపై గంటల గణగణ జయజయధ్వని దుందుభి మ్రోగింది ప్రత్యేక తెలంగాణ సాధన ప్రతిపాదన ప్రతిధ్వనితో లొల్లి నిజంగా కలలపంటను పండించి తీరుతాం !! అని అంటారు రచయిత.



## గెలుపుల నవలాకారుడు

"విజేత" ఒక ఆధునిక నవల సామాజిక పరిస్థితులకు అద్దం పడుతుంది. రచయిత సమాజాన్ని వివిధ కోణాలలో పరిశీలించి, అందులోని రుగ్మతల్ని అనేక పాత్రల ద్వారా ఎత్తి చూపారు. భర్త ఉండగానే విధవా పింఛను తెచ్చుకుంటున్న పుణ్యాత్మురాల్ని లంచాలు తీసుకొని విదేశాలకు వీసాలు, పాస్ పోర్టులు యేర్పాటు చేసే ధర్మాత్ముణ్ణి, డబ్బుతో సర్పంచ్ పదవి కోనుక్కొని గ్రామాన్ని శక్త్యానుసారం దోచుకుంటున్న రాజకీయవేత్తని, ఇంకా అనేక మంది వ్యక్తుల్ని వారి ప్రవర్తనల్ని చక్కగా ఆవిష్కరించారు. ప్రభాకర్ కథకుడిగా ప్రదానంగా బాలాజీ, ఆయన గురువు అనే రెండు పాత్రల చుట్టు పరిభ్రమిస్తుంది. బాలాజీ నవలా నాయకుడు. గురువు దిశా నిర్దేశకుడు. బాలాజీ దళితుడు. అయినా సంఘసంస్కరణ చేయాలనే నవీన దృక్పథం గలవాడు. సంస్కరణ ముందుగా తన గృహం నుండి ప్రారంభించి, సమాజం అంతటికి విస్తరింపజేస్తాడు.

స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుండి నేటి వరకు గల కాలంలో రాజకీయ వ్యవస్థ ఎలా ఉంది. ప్రజల భావాలెలా ఉన్నాయి అనే విషయాలు చర్చించాడు. నాయకులలోను అవినీతి ప్రబలి పోయిందని భావించారు. రాజకీయంగా అధికార పక్షంలో ఉన్న వారికి ప్రతి పక్షంలో ఉన్నావారికి పదవుల పైనే ఆకాంక్ష ఉన్నదని ప్రజా సంక్షేమం పట్టదని పాత్రల ద్వారా చెప్పించారు. రచనా చూస్తే భాష అతి సులభంగా ఉంది. రచయిత కథను నడుపుతూనే పాత్రల మనోధర్మ విశ్లేషణ చేసి సందర్భానుసారంగా దాన్ని వివరించాడు. ఇది ఒక ఆకర్షణ. ఒక కొత్త మార్గం. ఈ "విజేత" నవల చదవదగ్గ రచన, అభినందనీయము ప్రభాకరుడు అపరసూర్యుడు.

ప్రభాకర్‌జైనీ తన 'విజేత' నవల రచనలో క్రొత్త పొకడలు కల్గి సాహిత్య ప్రక్రియలో కొత్త ఒరవడిని కలువ నవల – సాహిత్యభిమానులు చదివి భద్రపరచుకునే గ్రంథం.

# "ప్రభాకరుని" విశ్వసుందరి

అమ్మగారి అమూల్య భావాలను కావ్యరూపంలో అందించుటకు ఆర్థిక శక్తి అత్యవసరము అభిమానుల పాఠకుల నుండి ఆర్థిక సహకారము లభిస్తే నాయీ సేవలకు మరింత బలము చేకూరుతుంది. మేడిచర్ల ప్రభాకరరావు 'విశ్వసుందరి' యను లఘు పద్య కావ్యము రచించుట కవిలోకమున కాశ్చర్యహేతువు. శారదాంబ యను గ్రహమేయని ఈ కవిపుంగవుని విశ్వాసము. "కనుమరుగౌచున్న తెలుగు సనాత విధానమున్" మరియు తన "జరాధి బాధలు తపితంగా నీ సేవకు నే నిరతము గావ్య రచన గావించటమే సరియైనది ఈ కవి నిశ్చయము. కారణమేమన కవి "భూమిపై రాణించ వాంఛయును లేదు, భోగ సంపదలపైన కోరికయులే" దని ప్రకటించి తాను తరించుటకే కావ్య రచన గావించుచున్నారు. కథా వస్తువు మహాభారతములోని సుకన్యా చ్యవనుల కథ. ఈ కవి తన కల్పానా చతురిమను ప్రదర్శించి దీనిని వివిధ కమనీయ ఘట్టములతో విస్తరింపజేసి, రమణీయముగా వర్ణించి, ఐదాశ్వాసముల సుందర మధుర కావ్యముగా రూపుదిద్ది విశ్వసుందరిగా నామకరణ మొనర్చినాడు. సుకన్య ఈమె గుణ రూప లావణ్య విలాసములను చక్కగా వర్ణించి ఈ కన్యను విశ్వసుందరిగా తీర్చిదిద్దినాడు కవి. తండ్రియగు శర్యాతి యొక్క సేనాపరివార సమేతయగు రాజ్యమును రక్షించిన సుకన్యను త్యాగమయ గుణవతిగా సిద్ధింపజేయుటయే ఎన్ని ప్రలోభము లెదురైనను భర్తయగు వృద్ధ చ్యవన మహర్షిని వీడక, దృఢ పాతివ్రత్య ధర్మమును ప్రదర్శించి, అశ్విని దేవతల ద్వారా అతనిని యువకునిగా పరివర్తన గావింప జేసికొన్నది భారతీయ ఆదర్శ నారీ రత్నముగా తీర్చిదిద్ది, సనాతన సాంప్రదాయాభిమానములను ప్రకటించి సంక్షిప్తముగా నైనను వివరించుట సమంజసము. ప్రథమమున నీ కవి కౌరవ పాండవులను వ్యాససంతతిగా పేర్కొని వీరి వీరి కుచేష్ట, సుచేష్టలనుగ్గడించెను. కపట జూదమున పాండవులోటమి జెంది వనవాసము పాలై యిడుములను భవించుచుండ, పురోహితుడగు ధౌమ్యుడుపదేశించిన సూర్యమంత్ర ప్రభావమున ద్రౌపదీ యుక్తముగా ధర్మజాదులు సమస్త సౌకర్యములను పొంది సుఖముగా నుండిరి. వీరిందరు దయమున నే మేల్కొని నర్మదా నదియందు స్నానములు గావించి, భుజించి నారదాది మునుల ద్వారా తీర్థయాత్ర స్థల మహత్యములను, ఋషుల మహాత్మ్యములను మరియు సుకన్యా చ్యవన మహర్ష్యాది గాథల సారమును వినుచు కాలము గడుపుచుండిరి. "వరపుత్రులు" అని నామకరణము. సన్నివేశమును రమణీయముగా వర్ణించినాడు. తర్వాత రాజు తమ రాజ్యమును విస్తరింపజేసికొని, ధర్మయుక్తముగా రాణులతో యువతీ యుకవ గణముతో, నటీనట వర్గముతో సపరివార సేనా సమేతముగా వన వినోదార్థము ఫలపుష్ప భరిత వృక్షములతో లాతా గుల్మములతో మరియు సుందర సరోవనములతో నలరారు వనమున వర్ణనలన్నియు మనోహరముగా నున్నది. ముద్దుల తనయ సుకన్యయు అతిలోక సౌందర్యరాశి "పౌర్ణమి చంద్రుడే ప్రక్కన గూర్చుండి, అబ్బుర పడి జూచె నామెముఖములు" "సృష్టికర్త విరించి సృష్టించెనెవరిని వాణితో నేతించ వనితజూడ, ప్రభాకరరాయకవి వర్ణనా నైపుణ్యములను తెప్పుచున్నవి. ఉభయ వంశలలాయ యగు పుత్రికను విషయ సమయమున తాను బలియై తండ్రి వంశమును గాపాడిన ఆదర్శ కన్యగా ప్రతిష్ఠించుట మిక్కిలి ప్రశంసనీయము.

ప్రజలే సంతానంబున్, ప్రజలేదైవంబు ప్రజలే రాజుకు సర్వము ప్రజల సంరక్షనను ఏ పుణ్యము చేపితినో నీ పొట్టను పుట్టినాను వర్ణనలను ప్రవేశపెట్టి దీనిని మధుర కావ్యముగా తీర్చిదిద్దినారు.

చిన్న కథను వర్ణనలతో శృంగార కరుణ రసములతో పరిపుష్టమైన చక్కని చిక్కని సహృదయ రంజకమైన కావ్యము అందించిన కవివతంసుడు మేడిచర్ల ప్రభాకరరావు గారు కర్మ విశేషాలు చెప్పి, దానిని కథకు అనుబంధంగా చేర్చారు. "కర్మలే కలిగించు సుఖము, కర్మలె తొలగించు బాధ" అని ప్రబోధించారు. ఈ కావ్యము వ్రాయుటలో మెళకువలు తెలుపుతు దోషములు రాకుండా జాగ్రత్త పరుస్తూ ఎప్పటికప్పుడు సరిదిద్దుతూ "విశ్వసుందరి"గా అలరింపచేసినారు.

# "నల్లమల రత్నాలు" - నానీల పరిమళం

ఆధునిక కవిత్వంలో నానీలు సరికొత్త ప్రయోగం. రాష్ట్రవ్యాప్తంగా నేడు ఎంతో మంది కవులు తమ సృజనను చాటుకోవడానికి మార్గం సుగమమైంది. నానీలు ఈనాడు సాహిత్య వీధుల్లో విహరిస్తున్నాయి. నానీలకు గాఢత, భావశబలత, కంఠస్థ యోగ్యత, కవన నైపుణ్యత, బుద్ధికుశలత వంటి లక్షణాలున్నాయి. మెరుపులు, తళుకులు, పదునైన పదాలు, వ్యక్తీకరణ శిల్పం నానీల నిర్మాణానికి శోభను కూర్చుతాయి. ఒక క్రమశిక్షణ నానీల్లో ఉంది. వర్ధమానులు. ప్రవర్ధమానులు అయిన కవులు ఈ ప్రక్రియను ఆదరించడం జరుగుతున్నది. సామాజిక దృక్పథాన్ని పుణికి పుచ్చుకున్న కవి ఎం.ఎ. గఫార్ 'నల్లమల రత్నాలు' పేరుతో నానీల సంపుటిని వెలువరిస్తున్నారు. విశ్వంభర / అంబరాన్ని తాకుతుందా? / అందుకే / సి.నా.రెను చదవండి అని హితువు పలికారు. మరికొన్ని నానీలు నినాదాలు. . . ప్రకటనలు, సూక్తులుగా రూపుదిద్దుకున్నాయి. కవిత్వాంత పెద్దగా లేకపోయినప్పటికీ పెద్ద మనసు మాత్రం చక్కగా ఆవిష్కరింపబడింది. పాలమూరు పరిమళాలు గఫార్ గారి నానీలకు అందరం సాదరంగా స్వాగతం పలుకుదాం. ఒక ముస్లీం కవి చక్కని తెలుగు భావాలతో వ్రాశారు. ఆ మధ్య నానీల మీద పెద్ద దుమారమే లేచింది కూడా. నండూరిని దుమ్మెత్తి పోసిన వారున్నారట. ధాన్యంలో తాలు గురించి చెప్పవలసిన పనిలేదు. నిజమైన కవి సూక్ష్మంగా ఆలోచిస్తే కవికి, నానీ విషయంలో మనం అతిగా స్పందించకుండా, నానీల ద్వారా మంచి కవిత్వాన్ని పంచవచ్చు.

| | |
|---|---|
| అమ్మ ప్రేమ, | మూలన పడ్డాక |
| ఎంత విలువైందో | తెలిసింది చక్కని వాన |

ఆలంపురంలో వట్టి గడియారమా ? కాదు పాలమూరు కవులుకు అలారం కవి గురించి చెప్పారు. గడియారం రామకృష్ణ దేశికోత్తముడాయన. దేవుడు అంతటా ఉన్నాడు. చక్రిసర్వోపగతుండు అని పోతన చెప్పినాడు. వేదోపనిషత్తులు, దర్శనాలు పరమాత్మను సర్వాంతర్యామిగా పేర్కొన్నాయి. ఒంటి నిండా, నగల బరువా, అందుకే కంటి నిండా



నిదరకరవు గొప్ప నిర్వచనం జరుగుతున్న సంఘటనలకు దూరంగా లేదు. దెబ్బతిన్న తెలంగాణ ఒక రోజు బెబ్బులిగా మారుతుంది. ప్రజలు పస్తులుండవలసిన దురవస్థ తెలంగాణది. స్వాతంత్రమే హింసకు తావులేకుండా లభించింది. తెలంగాణ స్వతంత్ర రాష్ట్రం కావాలన్నది ఇక్కడి ప్రజల కోరికకాదు వట్టి కోరిక గట్టి కోరిక.

| | |
|---|---|
| అదిగో ఇదిగో | ఎదురు చూపులు |
| తెలంగాణ | జాగరణ రాకడ ప్రాణం పోకట |

గఫార్ కలం నుండి వెల్వడిన నానీలు నిజంగా నల్లమలకొండల్లో లభించే రత్నాలవంటివే గఫార్ ఇలాంటి కవితా వ్యాసంగాన్ని కొనసాగిస్తాడని, మరెన్నో కావ్యాలు వీరి కలం నుండి జారువాలాలని ఆశిద్దాం.

# "రైతుగోస" శతకము

శతక సాహిత్యము అనేకపుంతలు తొక్కుతుంది. శతకములు భక్తి ప్రాధాన్యంగాను, ఉద్బోధముగాను వెలువరిస్తుంటారు. ఒక అంశమును తీసుకొని చెప్పే శతకాలు తరచుగా కనబడుతుంటాయి. పొగాకు శతకము, చీపురుకట్ట శతకము లాంటి వాటిని చెప్పుకొనవచ్చును. ఆ పంథాలోనే మట్టభూమన్నగారు వెలువరించిన "రైతుగోస శతకము"ను కూడా చెప్పుకొన వచ్చును.

రైతుగోస శతకములో రైతు యొక్క వ్యథలను 113 పద్యాలలో అందించారు. ఈ శతకమునకు నిర్మల్ మట్టభూమన్న గారు ఆటవెలది ఛందస్సులో "అన్నదాత కృంగె అవని భూమి" మకుటముతో అందించినాడు.

పగలురేయి అనక పనిపైన గురితోడ
చీకటి వెలుగనెడు చింతలేక
వేళపాళలేక వేసారుదెటులని -21-3

పంటపొలము పోయి పడిగేరి బతుకాయె
ఇంట బయట కోటితంటలవగ
అప్పు పెరిగి జీవి అంగడి బతుక -20-3

అమ్మబోగ అడవి అన్ని పంటలకును
చెమ్మగిల్లె కళ్ళు సొమ్ముజూడ
నెమ్మదైన మనసునేడదికరువ -12-3

శ్రీ మట్టభూమన్నగారి పద్యశైలి చాల సులభంగాను, పద్యం ఆకట్టుకొనే విధముగా ఉండి రచయిత ఎంచుకొన్న భావమును స్పష్టంగా సూటిగా అందించినాడు. రైతు జీవనములోని అనేక కోణాలను ఇందులో స్పృశించినాడు. ఇది ఏ రైతు చదువుకున్నా, ఆ రైతు యొక్క జీవిత కథలానే అనిపిస్తుంది. వానమామలై జగన్నాథాచార్యులు గారు వెలువరించిన రైతు రామాయణంలాగే రైతు జీవనతత్త్వాన్ని అందిస్తుంది. ఒక చక్కటి శతకమును చదివిన అనుభూతి కలుగుతుంది. ముందు ముందు మరిన్ని రచనలను రచయిత అందిస్తారని ఆశిద్దాం.



# ఆచార్య మాదిరాజు కవిత్వం "వెలుగు చుట్ట"

మనిషిలో వెలుగుతో నడిచి సరిఅయిన స్థితిలో దిశతో ఉత్తమ లక్ష్యంతో ఎంతో సాధించవచ్చుననే భావన కనిపిస్తుంది. ఈ దిశలో ప్రేమ శాంతి మనిషిపై విశ్వాసం సమన్యాయం స్వేచ్ఛ శాంతి లక్ష్యంగా ప్రజలకు మేలు సమాజ వికాస దృష్టితో పనిచేయడం పాలకుల చిత్తశుద్ధిపైన ఆధారపడి ఉంది. భాగస్వామ్యంతో ప్రజల్ని ఆదుకునేదిగా సమాజ వికాస దృష్టితో పనిచేయడం అనేది, కనీస స్థాయిలో పాటించడంపైన ఆధారపడి ఉంది. "ప్రజాస్వామ్య" లక్ష్యంతో భారత రాజ్యాంగం నిర్మితమయింది. తరువాత "సామ్యవాదం" చేర్చబడింది. 1950 డిసెంబర్ 10 నుండి ప్రతి సంవత్సరం మానవ హక్కుల దినంగా పరిగణించడం జరిగింది. మానవ హక్కులూ పౌర హక్కులూ రెండూ ప్రజాస్వామ్య వ్యవస్థను పటిష్ఠం చేసినవిగా తోడ్పడినాయి. తెలుగులో వర్తమాన కవిత్వంపై ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం రాజ్యాంగం అమలులోకి వచ్చినప్పటి నుండి స్వేచ్ఛా వాతావరణం ఎంతో ప్రభావాన్ని నెరపింది. భావనలో దృష్టిలో స్పష్టంగా కనిపిస్తుంది. కవిత్వంలో వైవిధ్యాన్నీ తెలుపుతుంది. రాజ్యం అంటే బజాన ఆయుధ ముఖ రూపం కాదు. సామాన్యుల బాధకు స్పందన కరువై హక్కును మాయం చేసే ఇంద్రజాల నీతిలో నడిచే రవి రథాన్ని అడ్డుకునే ఏమీ ఎరగని అలలూ చెట్లూ ! అమాయక ప్రాణి కోటి ! అవని పయి నడచే వెలుగు చుట్టూ నీడలు ! చీకటి ! ఒకటొకటీ దగ్గరగానో స్పందన తెరచిన పాత పుస్తకంలో పేజీల మధ్య దొరికిన ఎప్పటిదో కరెన్సీ నోటులా శిథిలాల మధ్య బయట పడిన శిల్పంలా మబ్బు నుండి చంద్ర రశ్మిలా అనుభవాలు చక్కని వివరణ. జన సమూహ స్థానాల్లో ఉగ్రవాద క్రీడ ! దీనికొక స్థలం లేదు; సమయం లేదు. ఆయుధం తెలియని అమాయకులపై పిడుగులా వచ్చి పడుతుంది ప్రమాదం నిప్పులాంటి కవిత భావ స్పందన. శాంతి శరీరం పయి నిలువునా మేకులు దించబడుతున్నాయి. కన్నీటితో తడిసిన నేల దాటితే నెత్తురు మరకల సమీకరణ ఎదురవుతుంది. చెట్టు క్రింద నీడ లేదు ప్రాణి లేదు చెట్టుపైన పక్షి లేదు గూడు లేదు

వికృతికి రూపాలు నడిచే మనిషిలో స్వరూపాలు. కాగితం పయి మౌనంగా కదలే అక్షరాలు లోన మానవ సంగీతాన్ని ముద్రించేను కవి స్పందనలు. నడచే వెలుగు చుట్టూ చీకటీ ! అగ్ని ! దూర దూరం కదలుతాయి ! తప్పుకొని మనిషి ప్రమాణానికి కవిత్వ నడక. మనిషిలో ఒక్కొక స్థాయిలో పైపైన అస్తమయం ఎరగని సూర్యుడూ మనిషి మనుగడ జీవిత చక్రం మంచి స్పందన. సృజన క్రియలో ఇది కృతి విశిష్టతకూ కారణమవుతుంది. ప్రతి స్పందనలో భిన్న భిన్నమయిన దృష్టి భేదాలకూ దారి తీస్తుంది. అభిప్రాయంలో గొప్ప రచన కవిని గురించి అంచనా స్థాయి మీరింది, మరొకరికి తగ్గుతుంది. ఒక్కొక్క విధంగా సాహిత్య చరిత్రలో స్థానం ఉంది. పద్యానికి సమాంతరంగా ప్రవహిస్తుంది. పద్యం కళాత్మకమయిన పరిణతిని పొందింది. ప్రజల సాంస్కృతిక జీవితంలో భాగమయింది. స్వేచ్ఛా కవిత్వం కళాత్మకమయిన వికాసంలో ఉంది. డాక్టర్ మాదిరాజు ఆరువది ఒకటవ కావ్యం ఒక నడుస్తున్న 'కలం ప్రవాహం' చక్కని స్పందనల సాహిత్యం, ఒకసారి నాలో ప్రవహిస్తున్న నది. నేడు నడిచే వెలుగు చుట్టూ 34 పేజీలో చదివే కవి అపై ఒక అనుభూతి, ఒక కవిగా మలుచబడ శిల, శిల్ప రూపం అవుతారు. అదే మాదిరాజు అద్భుత కవితాత్మ.



## తబ్దీల్

సిరిసిల్లాగపూర్ అప్పుడప్పుడు రాసిన కవితలనన్నిటిని "తబ్దీల్" పేరుతో ప్రకటించాడు. ఈయన శిక్షకుడు. శిక్షక్ అంటే ఉపాధ్యాయుడు. ఉపాధ్యాయుడు శిక్షకావిస్తుంటాడు. అలాగే ఈయనకూడా సమాజంలోని రుగ్మతలపై సామాజిక స్పృహను కలిగించే నిమిత్తం శిక్షక్‌గా మారి సిరిసిల్లాగపూర్ శిక్షక్‌గా మారాడు. సామాజిక సమస్యలను ఎత్తిచూపి, వాటినుండి తబ్దీల్ ఆశిస్తున్నాడు. తబ్దీల్ అంటే "మార్పు". సమాజ మార్పుకై కృషి చేయడం నేపథ్యం ఈ కవితా సంపుటి. తబ్దీల్ అనేది ఉర్దూ పదం. తెలంగాణాలో ఈ పదం వాడుకలో నున్నదే. తన మూలాలను వెతుక్కునే దిశగా, తను పుట్టి పెరిగిన ఊరు, తన బాల్యంలోని మధుర క్షణాలను, తారతమ్యాలను మరిచి గడిపిన గత జ్ఞాపకాలను మట్టిపరిమళం" కవితా శీర్షికలో ఇలా వ్యక్తీకరిస్తారు.

"నా ఊహల రెక్కలతో పయనమై
నే పల్లె వాకిట నిలుస్తాను
నా బాల్యం బాలశిక్షై
నా కనులముందు నిలుస్తుంది" పుట – 40

అని అంటారు. చిన్నతనంలో నేర్చుకున్న విషయాలు అన్నీ మార్గగాములై ప్రత్యక్షంగానో అప్రత్యక్షంగానో నిర్దేశిస్తుంటాయి.

"మనిషి మనసులో
అనుబంధమే అంతమయ్యి
ఆత్మీయత దూరమైతే స్నేహభావానికేదర్థం పుట – 31

అని అడుగుతున్నాడు. ఈ కవితా సంపుటిలో "స్నేహం" గురించి నాలుగైదు కవితలు ఉన్నాయి. ఈనాటి పల్లెటూరు బతుకును గురించి చెబుతూ –

"బస్సు పయ్యలకింద నల్గి
రోడ్ల మీదేసిన ధాన్యమోలయ్యింది బతుకు

ఇల్లు వాకిలి, ఊరు పరాయిదయ్యింది.
ఉరితాడు, పత్తిమందు సోబత్తైనై
ఎంతజెప్పినా ఏముంది
పల్లె బతుకులన్ని కుప్పకూలినై"                పుట - 10

ఈ కవితలలో స్పృహ ఉంది, ఆర్ద్రత ఉంది, సమాజ మేలుకొలుపుంది. ఒక చైతన్యవంతమయిన మార్పుకొరకు వేదన ఉంది. కవితలు ఒక్కసారి చదివిస్తాయి.



# మాదిరాజు రంగారావు దర్శన "పునర్దర్శనం"

లౌకిక జీవితంలో మనిషి ఉనికి భౌతిక మానసిక స్థాయిల్లో వివిధ పార్శ్వాలు 'అస్మిత'లో కనిపిస్తాయి. వర్తమాన సమాజంలో రోజూ విన్నదీ చూచినవీ చదివినవీ చింతనలో మెదలినవి ఆయా సందర్భాల్ని పురస్కరించుకొని సన్నివేశ నిర్మితుల్ని పొందాయి. ఇందులో కవితాత్మకంగా ధ్వనితమయింది. వ్యక్తి స్థాయిలో సమాజ స్థాయిలో ప్రజాస్వామ్యంలో పని చేసే వివిధ భాగాల్లో ఆలోచనలో ప్రవర్తనలో ఆదర్శంలో కొన్ని ప్రమాణాల్ని పాటించవలసిన అవసరాన్ని భావింపజేస్తూంది. పునర్దర్శనంలో అస్మిత మనిషి ఉనికికి సంబంధించిన విషయం విశాలమైన క్షేత్ర పరిధి కలిగింది. స్మితం అంటే చిరునవ్వుతో కూడిన కాంతి= కళ అనేది లేని ప్రస్తుతం ఉన్న స్థితిని భావింపజేస్తూంది. ఏది మంచిది ఏది చెడు అన్నది సూక్ష్మ స్థాయిలో చాలా క్లిష్టమయింది. 1) కథన భాషణ పద్ధతుల్లో 2) సన్నివేశ నిర్మితుల్లో స్వేచ్ఛా కవిత్వంలో "పునర్ధర్శనం' సమకాలీన చింతనతో మానవీయ భావనతో జీవితంలో వాస్తవ రేఖలతో ప్రజాస్వామ్య దర్శనంతో ప్రక్రియా విస్తృతికీ పేర్కోదగిన అస్తిత్వానికీ దోహదం చేస్తుంది. అభిలాషలో అనుభవంలో అవగాహనలో వివేచనలో భిన్న కోణాలూ స్థాయి భేదాలు ఉంటాయి. ఎదురు పడే మౌనరూపం అనుకోని ప్రశ్నల్ని సంధిస్తుంది అవకాశం సూచిస్తుంది. అవసరాలు నడిపిస్తాయి. కొసలు రెండూ కలిసి కాలం మెడలో హారమవుతుంది. రోజుకొకపుట ! సరికొత్త విషయంతో గళ్ళలో పావులా జన మనస్సు ఊరి బయట కాలి మాట నడుస్తుంది. అలల మధ్య స్థిరంగా సాక్షీభూతంగా విగ్రహం ! ఒక రూపాన్ని సూచిస్తుంది. చెలియలికట్ట పై నుండి ఎగసి దూకి తరలే కోరికతో ఒక్కొక్క కెరటం శాంతికై సముద్రమంత చర్చ ! మనిషిని సముద్రంలోకి దింపుతుంది. విరామ నిలయంలో శాంతి చుట్టూ ఆయుధ రక్షణతో ఎంత వ్యంగ్యం చూపారు రంగారావుగారు. చెట్ల నుండి నిర్ధాక్షణ్యంగా పండ్లనూ పూలనూ ఆకుల్నీ బాణంతోనో బులెట్ తోనే రాల్చే స్వప్నం ఆగిపోయింది ! స్నేహంతో సౌందర్యంతో ఆనందంతో కాలం ప్రత్యక్షం కావాలని! సామాన్యుని కోరిక కోరికగానే సాగుతుంది. భాషలో నిజాన్ని చూపుతుంది. బాధ్యతలో రూపొందే అక్షర చరిత్ర సమాజ పథం చూపుతుంది జీవన విధితో స్మృతులకు నియతి లేదు అనుభవానికి గట్టు లేదు బెట్టులేని నిజం.

అంకె ప్రక్కన జీరో చేరి జీరో వెనకన అంకె చేరి విలువ పెరిగినట్లు ఎవరి లెక్కలు వారివే! అంకెల గారడి కవి స్పందన నిరాశలోనూ నడకలో మజిలీ అశాంతి శిఖరం కాదు విపత్తులోనూ బ్రతుకులో ఆత్మహత్య చివరి శమనం కాదు నిప్పులాంటి విషయ దర్శనం ఆ రోజు పడిన పూలదండ మరునాటికి కసవులో చిమ్మబడీ కప్పిన శాలువా మరో నాటికి క్లాత్ స్టోర్‌లో చేరే నిజం అద్దం లాంటిది. కోరికలో నిశ్శబ్దం స్వర చిత్రంగా మారాలనీ ఆల్బం కావాలనీ జీవిత వాస్తవాన్ని నిలుపుతుంది నిజంగా కవి స్పర్శ అద్భుతం. రణ మంటే ఇష్టం ఉండదు అయినా జాతి మతం దేశం స్వార్థంలో రణ భేరీ జర్గల్సిందే కవి భావన రైలు కిటికీ నుండి ప్రయాణంలో ఎన్ని మైళ్ళు దాటారన్నిది నిజం. కల్పనా స్వేచ్ఛలో 'కవి సమయం' కవి స్పందనలే మాదిరాజు ఊహ బాధకు ఆర్తికి కాలభేధం లేదు. చక్కని కొటేషన్ కళ్ళముందు మారే దృశ్యం కొత్త ప్రపంచాన్ని చూపిస్తుంది. నిజం నిజంగా నిదర్శనం శిల్పంలో సుందర సంపద అయినా ఒక సందర్భానికే సరిపడుతుంది నిజంగా నిదర్శనం. బాధ్యత అక్కర లేదు హక్కులు కావాలనడం గోడలతో పని లేదు తలుపులు కావాలనడం చక్కని స్పందన విశ్వంతో ఒకటిగా చేస్తూ అస్మిత ! అన్న నిజం నిజంగా. ఎండలకూ వానలకూ తట్టుకొని పండిన పంటను చూడగానే కళ్ళ ముందు ఇంద్రధనస్సు అవతరిస్తుంది. సప్తవర్ణ ఆశలు చిగురిస్తాయి. కవి హృదయం ఒక దిశలో సూర్యుని ఉదయం. ఒక దిశలో అస్తమయ ముఖం ఎంత పరిపూర్ణం కవిది శ్రీ ఆచార్య రంగారావు ఒక మహాకవి అనుభూతివాదంలో ఒక ఉన్నత భావాలు కల్గిన కవిగా పేరున్న మహా మహావ్యక్తి.



# పోతనగాని సత్యనారాయణ హృదయస్పర్శ

మతతత్వం, మార్కెట్‌తత్వం, మథించిన సామ్రాజ్యాధిపత్యం నేపథ్యంలో సామాజిక స్పృహను సంతరించుకుంటున్నది. పోతగాని సత్యనారాయణలో – అదృశ్య శృంఖలాబద్ధ జీవన వలయాన్ని జయించే జీవన నాదాల్ని సమభావన వాదాల్ని ఒక్కసారి ఒక్కసారి చెవిరిక్కించి విను అని చెబుతున్నది. ఆ విధమైన ధిక్కార స్వరాల గురించే ధిక్కార శంఖారావాన్నవుతాను. మరో ఆధునిక గీతోపదేశాన్నవుతాను ప్రశ్నించి జవాబు చెప్పి ఉపాధ్యాయుడు సత్యనారాయణ. . . భుజంపై భరోసా స్పర్శ కావాలి 'కవిత్వం ఆసరా లేకపోతే నిలవలేదు అన్న దశ నుంచి అదే ఆసరా ఇవ్వాలని చెప్పే ఈ మాటలో కవి సామాజిక బాధ్యత గురించిన గొప్ప మెళకువ వుంది.

విజయమెప్పుడూ విప్లవాన్ని వరిస్తుందనడం జన నినాదం విప్లవం అంటే సమూలమైన సామాజిక పరివర్తన. 'గ్లోబల్ వార్మింగ్" వంటి కవితల్లో నేటి ప్రపంచీకరణ పరిస్థితులను కళ్లకు కట్టి కవి, "కదిలే గాయం"గా అమ్మను వర్ణించడంలో ఎంతో ఆర్ద్రత వుంది. "ఆ పాదాల కింద స్వర్గాన్ని చూస్తూ ఈ ప్రపంచాన్నే జయిస్తాను". కవిత్వంలో పల్లెతనం మనల్ని పట్టి లాగుతుంది. పల్లె మట్టి వాసనతో గుభాళిస్తుంది. 'బాల్య వసంతం' 'పల్లె సీత', కవితల్లో ఇది ద్యోతకమవుతుంది. కవిత్వంలో ప్రాసంగిక శైలి, అంతర్లయ మనల్ని ఆకట్టుకుంటాయి. పోతగాని 'హఠాద్గర్జన', 'పంకిలకృతి' 'మనస్సరస్తీరాలు', 'కస్తుద', 'జ్ఞాపకలతలు', 'మానవ హతదాహం' లాంటి నూతన పదబంధాలు శబ్దవైవిధ్యం కోసం సృష్టిస్తాడు. అలాగే అంత్యప్రాసలతో సమాస భూయిష్టంగా కవితను నడిపిస్తాడు. అక్కడక్కడ శ్రీశ్రీ, తిలక్‌ల ప్రభావం కన్పిస్తుంది. పోతగాని కవిత్వంలో ఆర్ద్రత ఉంది. భాష, భావం జోడు గుర్రాల్లా పరిగెట్టాయి. ప్రాస కోసం ప్రయత్నం ఉన్నప్పటికీ అది కృతకంగా అనిపించక కవితలో అందంగా ఒదిగిపోయింది. ఈయన కవిత్వంలో కొంత సంక్లిష్టత, గ్రాంథిక భాషాప్రయోగం అక్కడక్కడా కన్పిస్తుంది. అయినప్పటికి అది మరీ ఇబ్బందికరంగా అనిపించదు. పోతగాని సంస్కృత శబ్ద ప్రయోగంతో మనల్ని అలరిస్తాడు. 'గ్లోబల్ వార్నింగ్'లో సామ్రాజ్య వాదాన్ని నిరసిస్తూ అమెరికాని తీవ్రంగా హెచ్చరిస్తాడు. 'ప్రవాహ స్పర్శ'లో రాజ్య హింసను

ఖండిస్తాడు. మాతృమూర్తినీ, 'ఇంటి వెలుగు' ఇల్లాలిని ఆత్మీయంగా, ఆర్ద్రంగా కవిత్వీకరించి కదిలిస్తాడు. 'ధిక్కార శంఖారావం'లో పురుషాధిక్యాన్ని ధిక్కరిస్తూ 'వాడి చేతిలో మలచబడ్డ, అణచబడ్డ, చెఱచబడ్డ మరో పురాణ స్త్రీని కాబోను / నేనొక పూరించిన ధిక్కార శంఖారావాన్నౌతాను / మరో ఆధునిక గీతోపదేశాన్నౌతాను" అంటాడు. సింగరేణి మీద ఒక విలక్షణమైన కవితను చెప్పాడు. "వైశ్వానరుని స్వేద రత్న కాంతులందుకొని యుద్ధం" కవితలో "యుద్ధం మత్తులో జోగుతున్న మనిషి మానవత్వం ఏ యుద్ధంలో చచ్చిందో ఆచూకీ తేలడం లేదు" అంటాడు వ్యంగ్యంగా అవును కదా మనం ఇప్పుడు మానవత్వం వెతుకులాటలోనే ఉన్నాం ! 'అణుభూతం'లో కూడా రాబోయే అణుయుద్ధాల పట్ల స్పందిస్తూ "శాంతికి అణుజ్వరమొస్తొంది చూడు" అంటూ హెచ్చరిస్తాడు. "ఉరిశిక్షకు ముందు కోరిన కోర్కెను చట్టం, మరణం ముంగిట నిల్చిన మనీషికెందుకో తిరస్కరించింది" అంటూ న్యాయస్థానం వేంకటేష్ కోర్కెను తిరస్కరించడాన్ని ప్రస్తావిస్తాడు. 'గ్రహణం పట్టిన సమాజం'లో "సమాజంలో నిజాన్ని మింగిన నిట్టూర్పులా కన్పిస్తుంద" అని అంటాడు. చాలా మంది తెలుగు కవులకు కవి సమ్మేళనాలలో కవిత్వ పఠనం ఎలా చేయాలో తెలియదు. ప్రచురణలో చదివే కవితకీ, సభాముఖంగా వినిపించే కవితకీ గల సున్నితమైన తేడాను కవులు గమనించరు. (అలాగని ఈ నియమం అన్ని కవితలకు వర్తించదు). దృశ్యం ఎంత నయనానందకరంగా వుండాలో భాషణం అంత శ్రవణానందకరంగా ఉండాలనే స్పృహ సాహితీ వేత్తలు కలిగి ఉండటం అవసరం. 'అక్షర శిఖరం' "ఆమె నాకొక వరం ఆమె నా స్వరం. సర్వం" గర్వంగా చెప్పటం ద్వారా మనం మహిళల కెంతటి గౌరవాన్నివ్వాలో చాటి చెప్పారు.

అడుగడుగునా అభ్యుదయ భావాలను వెదజల్లిన కవి మిత్రుడు సత్యనారాయణ 'ఆరంగ్రేటం'లోనే అభినందనీయమైన కృషి చేశారు. కల్ప సుందరసముద్ర హోషయికితాబు రాత్రి కుండపోతగా ఎడతెరిపిలేకుండా కురుస్తున్న వానలో మా పూరిగుడిసె కన్నీరై శ్రుతి కలిపినపుడు అమ్మ మమ్మల్ని పచ్చడి జాడీల గూటిలో పడుకోబెట్టి, తన అరచేతుల్లో మా యింటిలో నిండిన వాన నీటిని తోడిపోస్తోంది. తెల్లవారింది వాన వెలిసింది. అమ్మ పందిట్లో తన అరచేతులు చూసుకుంటోంది. చివికిపోయి నెత్తురోడుతున్న తన చేతుల్ని చూపిస్తూ...."బ్రహ్మ గీసిన అతుకుల గీతలు చెరిగిపోయినై బ్రహ్మ ఎప్పటికి మంచి రాతలు రాస్తాడోనని చూస్తున్నా" నంది. కవిని మేల్కొల్పిందనుకుంటాను. ఓ కన్నీటి తడి కదిలించినపుడో, ఓ ఆర్తనాదం వినిపించి నపుడో, ఓ బాల్యస్మృతి కదలాడి నపుడో హృదయ స్పందనకు ప్రతీకలైన భావాలు అక్షరాలుగా ప్రోగుపడి కవిత్వపు జాలుగా ప్రవాహ స్పర్శలైనవే ఈ కవితలు.



## కాకరపర్తి నానీలు "చూరులో చుక్కలు"

కాకరపర్తి నానీలోని నిర్మాణం కవి కవితాశక్తికి నికషోపలంగా వుంటుంది. ఈ రూప ప్రక్రియను అక్కడక్కడ వ్యతిరేకించేవారు. వాటిని సీరియస్‌గా చదవనివారే. నానీల గురించి గుసగుసలు పోయేవారు సాహిత్య కారణాల వల్ల సాహిత్యేతర అభిప్రాయాల వల్ల అలా చేస్తారు. నానీ ఇన్‌స్టాంట్ కీర్తికి షార్టుకట్ కాదు. అనల్పమైన భావావేశాన్ని అల్పాక్షరాల్లో చెప్పడం తప్పా! అలాగైతే వచన కవితల పేరుతో ఎంత వ్యర్థపదార్థం రావటంలే విషయమది కాదు దేనికైనా కవితాశక్తి ముఖ్యం. సూక్తి సుధలను చిలికేవిగా ఉన్నాయి. అంధుడికైనా కనిపిస్తూ ఆనందం పంచుతుంది అమ్మ ప్రేమ మనం జీవిస్తే మంచి జరగాలి మనం మరణిస్తే కీర్తి పెరగాలి నానీల్లో అందమైన భావాలే కాదు సామాజికత, లోకవృత్తపరిశీలన ఉన్నవి పుష్కలంగా ఉన్నాయి. ముఖ్యంగా జీవన కూపాంతరాల్లోకి బొక్కెరవేసి రససాధన చేసేవిగా ఉన్నాయి. కాకరపర్తి నానీల్లో ఆర్ద్రత, సామాజికత, దేశీయత, కవితాత్మకత ఉన్నాయి. ధ్యానమాలిక, వాసవీస్రవంతి, నేటి నిజం, రమ్యభారతి, ప్రసారిక వంటి అనేక పత్రికలు ప్రచురించి ప్రోత్సహించాయి. తెలుగు సాహితీ వనంలో వారందించిన నానీల మొక్కలను పెంచి పరిమళ కుసుమాలను అందించే ప్రయత్నం ప్రారంభమైనది. కాకరపర్తి వారి కృషి ఎంతో అభినంద నీయము నానీలు కేవలం సాహితీ ప్రక్రియలు కావు, ఎవరి ఆనందంకోసమో వ్రాసినవి కావు, సమకాలీన సమాజంలోని లొసుగులు, ముసుగులు చూసి వ్యథాభరిత హృదయంతో, ఆర్తితో, గుండెలోని ఘోషను అక్షరరూపంలో వెలువరించారాయన.

# భద్రకాళి సుప్రభాతం - అమ్మకు మేలుకొలుపు

'భద్రేశ్వరి'గా ఆమె కాకతీయుల కాలం నాటికే ప్రసిద్ధమైనట్లు 'ప్రతాపరుద్ర చరిత్ర' 'సిద్ధేశ్వర చరిత్ర'లు అందిస్తున్న సమాచారం. వీటన్నిటిని పురస్కరించుకొని ఆలయం సుమారు వేయి సంవత్సరాల కంటే ముందే వెలసియుంటుందని అందరి యభిప్రాయం. కాకతీయులచే నిర్మింపబడిన ఆలయాలలో వలెనే దీనిలో కూడ కమనీయమైన కాకతీయ శిల్పం కనిపిస్తుంది. భద్రేశ్వరి ఆలయం కూడా శిల్పకళాభిరామమై, వైభవ ప్రాభవాలలో విరాజిల్లింది. ఆనాటి నుండి నేటి వరకు తన సహజ కళాకాంతులను కోల్పోక, నిత్య నూతన సౌందర్యాన్ని సంతరించుకొని, ప్రాచీన వైభవానికి దర్పణంగా నిలిచింది. క్రొత్త అందాలను ఒలకపోస్తూ, భక్తులను, యాత్రికులను ఆకర్షిస్తుంది. అలరిస్తున్నది. పుణ్యస్థలంగా ప్రసిద్ధి గడించింది.

వరంగల్ నగరాన్ని, ప్రజలను కాపాడుతున్న కన్నతల్లి శ్రీ భద్రకాళీ, పరాశక్తి, కొలచెడు వారికి కొంగుబంగారము. కరములెత్తి మ్రొక్కేవారికి కల్యాణదాయిని. ముక్తిని గోరే వారికి ముంగిలి ముత్యము. దుష్టులకు ఆమె రౌద్రరూపిణి, ప్రేతాసనాధ్యాసిని, మహిషాసురవర్దని, సింహవాహని, శస్త్రధారిణి, శిష్టులకామె శివస్వరూపిణి, ప్రసన్నవరన, ప్రశాంతమూర్తి, వరదాభయ హస్త. ఇట్లు ఏకకాలంలో భక్తుల తత్త్వాన్ని బట్టి పరమ రమణీయంగా, రమణీయ భయానకంగా కనిపించే దివ్యరూపము శ్రీ అమ్మవారిది.

శ్రీ భద్రకాళీ దేవాలయం క్రీ.శ. 625లో చాళుక్య ప్రభువైన రెండవ పులకేశి కట్టించినట్లు కొందరు చెబుతారు. ఆధారాలు లేవు గర్భాలయానికి ముందున్న రెండు స్తంభాల మీద ఉన్న శాసనములను బట్టి ఎఱ్ఱ భూపాలుడు దీనిని నిర్మించినట్లు తెలుస్తున్నది.

కాకతీయ చక్రవర్తులలో చివరివాడైన ప్రతాపరుద్రుని కాలానికే ఈ ఆలయం చాలా ప్రసిద్ధిలో నున్నట్లు విశదమవుతుంది. మొదట తమ 'అభిమాన దేవత'యైన దుర్గాదేవిని పూజించి, హనుమకొండ వెలుపలనున్న తోటలో తన సేనలు విడిది చేసినట్లు ప్రతాపరుద్రీయంలో చెప్పబడింది. ఈ ఆలయం నేడు పూర్వవైభవాన్ని సంతరించుకొని, ఆంధ్రదేశంలోనేకాక, యావత్ భారతదేశంలోనే ఒక ప్రసిద్ధ దేవాలయంగా



అలరారుతున్నది. 'సుప్రభాత' కల్హారా మాలికతో అలంకరిస్తున్నవారు శ్రీ ఆరుట్ల భాష్యాచార్య గారు. సంస్కృతాంధ్ర భాషలలో చక్కని పాండిత్యం సంపాదించిన భాష్యాచార్యగారు ఈ కావ్య రచనకు పూనుకోవటం "విద్వత్ కవయః" - అన్న ఆర్యోక్తిని అనుగుణంగా పాండిత్య - కవిత్వ లక్షణాలు ఏకత్ర మూర్తీభవించిన విద్వత్కవులు.

కవి సంప్రదాయ బద్ధుడైనా, ఆధునికములైన పరిసరాలను మరిచిపోలేదు. మానేరు ముంచి తెచ్చిన నీటితో భద్రకాళీ చెరువును నింపి, ప్రజలకు నీరందిస్తున్నారు.

గోదావరి సలిల మిశ్రజలాశయం తే
సంజీవ నైషదసమం సకలం ప్రజానాం

భావ పరిపుష్టితో పాటు, అభివ్యక్తి సౌష్ఠవాన్ని ప్రదర్శిస్తున్నది వర్ణణాతీతం !

ఆరుట్ల వారి "భద్రకాళి సుప్రభాతం".

# భక్త కోవిదుల "సూక్తి - ముక్తి"

'నీవు నీవని నిన్ను నేనిట్లు దలచి, వలచి నీ పొందునేగోరి వదలలేక నిన్ను చేరెడి వేళకై నిలచియుంటా స్వామి దయజేయుమయ్యా యిదేమి జాగు' అని హార్ద్రంగా ఆర్తిని ఆవిష్కరించారు జాను తెలుగు జాలువారినది. ఒక వ్యక్తిపై సాత్త్విక దైవ దృష్టిపడటం గూడా అటువంటి కారణమేమో. ఒక క్షణంలో పుట్టినా ఒకే వంశంలో పుట్టినా ఒకే క్షేత్రంలో పుట్టినా వారు అందరూ ఒకే స్థితిలో వృద్ధినొందరు. జీవనంలో కలిగే నీచోచ్ఛస్థితికి మూలకారణం వారి వారి పురాకృత కర్మ తారతమ్యమే. పరోక్షమైన వాస్తవము. జన్మ సమయములో జాయమాన సాత్త్విక భగవత్కటాక్షానికి పాత్రులై పరమ భాగవత కుటుంబంలో జన్మించినవారు శ్రీమాన్ సముద్రాల పురుషోత్తమాచార్యులవారు. జీవికకై లౌకిక విద్యను స్వీకరించవలసి వచ్చినా, పితృపాదుల పవిత్ర సంస్కారం సంక్రమించటం వలన, భగవత్కృపచేత శ్రీవైష్ణవదీక్షను లభించుట వలన, ఉజ్జీవన సాధనములైన సంప్రదాయ గ్రంథములను, సేవించటం వలన, సదాచారనిష్ఠ ఏర్పడి వీరి జన్మ సార్థకమైనది. యథాశక్తిగా భగవద్భాగవత సేవకు జీవితం అంకితమైనది. హృదయంలో పెల్లుబికిన భక్తిభావాలను ఆవిష్కరించగలిగిన ధారశుద్ధి వీరికి పద్యరచనలో ఏర్పడినది. ఇది శుభ పరిణామం ఎందుకంటే పద్యరచనల శిల్ప సౌందర్యాన్ని ప్రయత్న పూర్వకంగా చొప్పించి, పరుల హృదయాలను మెప్పించి, కీర్తి ప్రతిష్ఠ నార్జించాలనే ఆరాటం కొందరు కవులలో చూస్తున్నాము. సభక్తి కవులలోనుండదు. భగవంతునికి తమ ఆవేదనను వినిపించి ఆస్వామిని ప్రసన్నుని చేసుకొనుటకు మాత్రమో ఉపయోగ పడేవే గాని, సర్వజ్ఞుడైన ఆ స్వామిని మెప్పించగల్గిన ప్రజ్ఞాశక్తి అల్పజ్ఞులైన మానవులలో అసంభవగ్రస్తమే. శ్రీయామున మునీంద్రులు, ఆళ్వారుల రచనలన్నియు భక్తిభావనకు ప్రాధాన్యమిచ్చినవే కాని, శిల్ప సౌందర్యపూరితములు కావు. ఆళ్వారులు సూక్తులలో అంకారాది చమత్కృతి గోచరమైనా, స్వతః సిద్ధమైన ధారలో వచ్చినవే. స్తవ్యం: స్తుతి ప్రియః - స్తోతా స్తుతికి అర్హుడు భగవానుడే. స్తుతితో సంతసించువాడును, భక్త హృదయము నధిష్ఠించి స్తుతి ప్రేరణను కలిగించినవాడు అందుకు తగిన జ్ఞానాన్ని వాక్శక్తిని గూడా ఇచ్చినవాడు ఆ స్వామియే. తన భక్తితో అందించిన ఈ గ్రంథము అందరినీ అలరింప చేస్తుంది.



# రవీ - మా రవీ

ఇందులో నూటిరవైమూడు పద్యాలను కూర్చాడు. ఒకటి, రెండు, మూడు అన్న వరుస ఉంది అంకెల్లో. ఇదో విశిష్టమైన సంఖ్య అని గణితశాస్త్రంలో పరిచయమున్న ఎవరికైనా తెలుస్తుంది. విడి విడిగా కలిపినా. . . విడి విడిగా హెచ్చవేసినా వచ్చే ఫలితాలు సంఖ్య ఒకటే ఆరు. ఇలాంటి సంఖ్య ఇంకొకటి లేదు. ఆరు రసాలు, షడ్రుచులు ఉన్నాయి. రుచి అంటే రసన గ్రహించే రుచి గాదు. రుచి అంటే వెలుగు. ఈ ఆరు వెలుగులు మన మనస్సులోని కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు. వేట కవి విడిగా చదివినా వచ్చే కట్ట కడపట అనుభూతికీ అన్నిటినీ కలిపి చదివినా వచ్చే అనుభూతికి వ్యత్యాసం లేదు. రెండూ ఒక్కటే. రెండింటి పరమార్థం ఒకటే. ఇక్కడ భక్తి ప్రాముఖ్యం ఉన్న కవితలున్నాయి. ఒక్కో దేవుని నామధేయం నుండి వచ్చినా అందులో దైవత్వమే కానీ నిర్దిష్టదైవానుద్దేశించినవి కావు. అందరూ ఏకమైనపుడు ఆ పరమాత్మనే అని నా సంఖ్యా నిర్దుష్టానికి ఇంత విపులమైన వ్యాఖ్యాలు వచ్చింది.

పద్యాలలోని భావాలు సార్వజనీనమైనవి. భక్తి పారవశ్యంలో భక్తులందరూ ఏకీభవించుతారు. సాదృశ్యం కనిపించితే అది కేవలం యాదృచ్ఛికమే నని బొడ్డ మనస్సు అని సంభోదించారు కవిగారు.

ఆ కవితా పిపాస గని అంటిని ఒక్కదినాన మారవీ
నా కవితా కుమారికను నల్వురి ముందర నీ కరాలలో
వీగక నుంచి వేతునని వెల్లడి సేసిన వెంటనే కృతిన్
చేకొని జన్మధన్యతను చెందె మదీయుని దంచు పల్కినన్

చక్కగా కవి తెల్పారు.

కొడుకును మేను లేదు. . . బుస
కొట్టెడు పాముకు బుర్రలేదు. . .ఆ
కడలికి శాంతి లేదు. . . .
విషయ విశద పద్యం
ప్రకటము కాదు. . . కన్న ఒక

పద్యము వ్రాసిన వాని గూడ నే
సుకవిగనే తలంచి కవి
సోదరులందరకున్ నమస్సు పొం
దిక. . . మనసారా చేతు తమ
దీవెన లందగ చేయ మారవీ !

అందరి దీవెనలని అనడం చక్కని విద్యాపరుడైన సాగరుడు-

కరిగెను ధర్మమెల్ల. . . అణ
గారెను శాంతి. . . అహింస ఎంతయో
పెరిగెను. . . ద్వేశ, మర్మ, కసి
పెచ్చెను. వాని సముద్ధరించి యి
ద్ధర నెలకొల్ప న్యాయమును
ధాటిగ సాగతి వేమి దేవరా
తురగము నెక్కి కల్కివలె
తొందర తొందర పూని మారవీ !

కలియుగ రీతిని కోరుచూ, కలియుగ పాపాలను చక్కగా వివరించారు కవి.

హారతి లేని పూజ. . .సుమ
హారము లేని పడంలు వేణి. . .వ్యా
పాదము లేని అంగడి . . . స
భాపతి లేని సదస్సు. . . ఇంత బం
గారము లేని తాళి. . .నుడి
కారము లేని కవిత్వ కల్మి. . . శృం
గారము లేని శోభనము
కాలె వృధా జగమందు మూరవీ !

చక్కని విషయ సేకరయలతో నిక్కస్సిగా తెలిపిన రవి ఈ కవి.

నా కృతి కన్నె తీత నయ
నాంచాల ముందున కీర్తికాంత
నాకృతి భర్త. . . సంపదల
నారత మంది. . . చిరాయు వందగా



తన కవిత్వం, తన కవిత్వంకు కృతి భర్తకు చిరాయానం కోరే కవివర్యుడు గొప్ప విద్యా సాగరుడే!!

ఈ పుస్తక చందోబద్ధంగా చక్కని మకుటంతో సాగే నూట ఇరువదిమూడు కావ్య సుగంధ కుసుమాల హారే మారవీ !! భక్తి కాల్వే ముక్తి వాచకం శ్రీ జోస్యం విద్యాసాగర్ అభినందనీయులు. వీరి మరిన్ని కావ్యాలు రావాలని కోరుకుందాం. (ప్రతులకు ఇం.నెం. 12-2-827/5, క్రాంతినగర్, మెహదీపట్నం, హైదరాబాద్ - 500 028 యాబది మూల్యం పంపిపొందవచ్చును.)

# సంగెవేని ఆవేదనే "సామాన్యుడి సణుగుడు"

విమర్శించే కోణంలో కాకుండా పరిష్కరించే కోణంలో ఆలోచిస్తా క్రియాశీలి. ఆచరణ ఆరాధిస్తాడు. మానవీయ సంబంధాలను కోరుకుంటాడు. మన జీవితము గొప్ప పరిణామం మన జీవితంలోని విశేషాలను పట్టుకొని విశ్లేషించే ఒక 'నామిని' కని సీసాలతో, దోసిల్లతో జనం నీళ్ళు తాగి ధృవీకరణ పత్రాలు జారీ చేయటం మొదలెట్టారు. ఇదంతా అల్లా మహిమే బేకింగ్ న్యూస్‌తో ముంబాయి అట్టుడికిపోయింది. రవీంద్ర సణుగుడు చెక్కతో బంతిని కొట్టి కొంపలంటుకు పోయినట్లు పరుగులెత్తాల్సిన ఆటకు సమితులు కాల్చి చేసే యజ్ఞానికి ఎక్కడైనా సంబంధం ఉంటుందా? ఒక ఆటగాడి ఆటకోసం కొందరు సొల్లుగాళ్ళు ఏదో యజ్ఞం అంటు డ్రామా లేస్తే ఈ టి.వి. వాళ్ళు మూర్ఖత్వంతో చెత్త ప్రసారం చేసి దేశానికి ఏం సందేశం ఇవ్వాలనుకుంటున్నారు? దాదాపు నాలుగు దశబ్దాలుగా భారత వెండితెరను ఏక ఛత్రాధిపత్యంగా ఏలుతున్నా మహరాజు మాట్లాడితే ఆదేవేదం. ఏది ధరిస్తే అదే ఫ్యాషన్, అదే ఆదర్శం. పిల్లలు, మహిళలు, యువకులు, ముసలోల్లు, అందరికి వెండి పిలుపు ముట్టుబట్టల్నుండి మూలచీపిరి దాక, నెత్తి వెంట్రుకల్నుండి చెత్తకుండీల దాకా అన్నింటిని ప్రచారం చేస్తూ కోట్లు సంపాదించిన ఆ మెగాస్టార్‌కు, ప్రతి దయ్యానికి, మసీద్, చర్చ్, గురుద్వారా, ఎల్లమ్మగుడి, మైసమ్మగుడి, ఇవన్ని అమర్‌సింగ్ తోడురాగా, తిరిగడం, నిస్సిగ్గు మీడియం హైలెట్స్‌గా వాటిని ప్రచారం చేయడం వెర్రి పువ్వుతనం గాక మరేమిటి? సామాన్యుడికి ఉదయం ఎదురుగా కనిపించే ప్రశ్న కడుపెలా నిండాలి? ఆకలెలా తీరాలి. . .? ఆకలి పోరాటం చేసే సామాన్యులకు ఆ అజ్ఞానపు మూటలు చేరవేసి దారి తప్పించే దగుల్బాజీలు ముంబాయిలో వున్నా, చెన్నైలో ఉన్నా, డిగ్రీలు చదివినా, సైన్స్ చదివినా తలలేని కోళ్ళు లాంటి వాళ్ళే ముంబాయి ఆర్థిక రాజధాని మాత్రమే కాదు. వ్యర్థపదార్థాలతో తయారైన పెద్ద తలలు ఇక్కడా చాలానే ఉన్నాయి సామాన్యుడిని దారి తప్పించే కుట్రదారులు కూడా ఎక్కువే అమావాస్య అర్థరాత్రులు సముద్రతీరంలో ఎక్కడ చూసిన మీకు మంత్రగాళ్ళు చీకట్లో భయంకర పూజలు చేస్తూ అసహ్యంగా కదులుతూ కనిపిస్తూ వుంటారు. "నిజం. . .! ఏ హై ముంబాయి మేరే జాన్. . ." సామాన్యుడి సణుగుడిలో



నిత్య సత్యాలను టార్చిలైటుగా చూపారు ఈ రవీంద్ర కవి గారు ముంబాయి నిజాలను పల్లెల్లో ఇరుగు పొరుగును ఎవరినో ఒకరిని తిట్టాలనుకుంటే వాళ్ళ ఇంట్లో ఉన్న, పిల్లుల మీద పెట్టి, బర్ల మీద పెట్టి తిడుతుంటారు. మధ్యతరగతి ప్రజలు సామాన్యుడి సణుగుడికి ప్రతీకలు. ప్రపంచంలోని విషయాలపై స్పందిస్తు, ప్రతి స్పందిస్తూ గొనుగుతుంటారు ఎప్పుడెప్పుడు ఏమేమి జరుగుతూ వచ్చిందో ఈ సణుగుడులో కొంత తెలుస్తుంది. రవీంద్ర గారి కవిత్వ కరవాలం నుండి జడిపించిన శివాజి ఖడ్గం.

గాంధీజీ చెడు అనవద్దు, చెడుకనవద్దు, చెడు వినవద్దు అన్నాడు. అయితే చెడును మార్చడమెలా? చెడును మంచిగా మార్చడం జరిగినప్పుడే అది సాధ్యం చక్కని సామాజిక, ఆర్థిక, పరిణామాల సమాచారం ఎంతో ఉంది. ముంబైలో గార్మెంట్ రంగంలో తెలుగు వారు అగ్రగణ్యంగా ఉన్నారు. వందల కొలది బట్టల దుకాణాలు టైలర్ షాపులు, బ్రాందీ షాపులు, బంగారు నగల దుకాణాలు, తెల్ల కల్లు కేంద్రాలు, టైలర్ షాపులు, కిరాణా స్టోర్స్, వాచ్ రిపేర్‌లు, ఫోటో స్టూడియోలు, డిటిపి కేంద్రాలు, ప్రింటింగ్ ప్రెస్‌లు, చికెన్ సెంటర్‌లు, కాల్ సెంటర్‌లు, కమ్యూనికేషన్ కార్నర్‌లు, సూపర్ బజార్‌లు వంటివి తెలుగువారు. వి.ఐ.పి. అండర్ వేర్‌ల కంపెనీతో సహ ఐదు రాష్ట్రాలో వ్యాపించి మయూరి బీడి లాంటి సంస్థలన్నీ తెలుగువారివే. తెలుగు జనాలు ముంబైలో దాదాపు 10 లక్షల వరకు ఉన్నట్లు అంచనా" ముంబాయి మురికి కాలువల్లో చెత్త చెదారాన్ని ఎత్తి వేసే మహిళా సంఘాలు వీటిని పట్టించుకోవాలని కోరారు. ఇతర ప్రాంతాలలోని వారికి కూడా ఎంతో ఉపయోగం సాంస్కృతిక సమాచార వారధి వాహిక పెరుగుతుంది ఆపనికి కూడా సంగినేని రవీంద్ర కొన్నింటిని పూనుకున్నాడు. తాగి కారు నడిపి రోడ్డు ప్రక్కన పడుకున్న పాలమూరు కుటుంబాల పైకి పోనిచ్చి ఏడుగురిని బలీ తీసుకున్న సంఘటనను వర్తించిన తీరు హృదయాన్ని కలిచి వేస్తుంది. ఇలాంటి వాటిని రాయడం తనలో తాను సణుగుకున్న సణుగుడు విషయాలు ఇవి తాను పుట్టి పెరిగిన జగిత్యాల ప్రాంత ప్రజల జీవితాలను, సంస్కృతిని, జ్ఞాపకాలను సంఘటనలను చిత్రించే విధంగా తన వస్తువును, శిల్పాన్ని మార్చుకుంటూ జీవితమే గొప్ప పరిణామం మన జీవితంలోని విశేషాలను చక్కగా వివరించారు కవి గారు, వారి జన్మస్థలం నా జన్మస్థలం ఒక్కటే నేను వరంగల్ నివాసినైన, కవి రవీంద్రగారు ముంబాయి స్థిర నివాసులమైనాం.

# ప్రసన్న సాహిత్య 'మణికర్ణిక'

ఒక నిశ్శబ్దం నుంచి ఎగిసిపడే సముద్ర కెరటమై వెదురు బొంగు నుండి వీచే గాలి మధుర గానమైనట్లు సాగే ప్రసన్నమైన భాషా భావుకుడైన మాగురువుగారి కలం నుండి జాలువారిన, జారిన హృదయ వేదనలు ఆపై సాహిత్య పొలంమీద భాషా క్షేత్రం పంట పండించి పంచే ఋషి. సాహిత్యమే జీవితము, జీవితమంతా అధ్యయనం. . . బతుకంతా మానవ వికాసకాంక్షా లక్ష్యంగా సాగిన నిరంతర యానమూ ఐన ఆయన ఒక మౌన శిఖరమై, మా మధ్య ఒక నిశ్శబ్ద సముద్రమై, యోగియై భాసించారు. ఆయన అప్పుడప్పుడు ఒక దుఃఖనదియై 'మనిషి' విషయంగా అంతమమైన పరమసత్యాలను అక్షరబద్ధం చేస్తూ వచ్చారు. అప్పుడే కొమ్మలను చీల్చుకొని జన్మిస్తున్న చిగురుటాకుల వంటి ఆ వాక్యాలను ఎప్పటికప్పుడు ఆస్వాదించే భాగ్యం కలిగేది 'మణికర్ణిక'. ఈ పుస్తకం యొక్క పేరు, పుస్తక హృదయం, విషయం, వ్యక్తీకరణ, విస్తరణ, అసక్రమణ, గ్రహణ నుండి స్ఫోరకమయ్యే ఉన్మీలన.. . అన్నీ కొత్తవి.

చెట్టును వీడి గాలి సముద్రం వైపు, పర్వతాలవైపు, ఒక ఆకాశం వైపు వెళ్ళిపోయినట్లు ఒక కుర్చీని ఖాళీ చేసి వెళ్ళిపోయాడు – 'ఖాళీ' అంటే ఎప్పటికైనా తప్పకుండా పూరించబడేదని, ప్రతిరోజు ఎటో వెళ్ళి తిరుగొచ్చే మనిషి వెళ్ళి తిరిగి రాక పోవడం 'మరణం' అని కదా నిర్వచించాడు. వెళ్ళిన మనిషి ఎక్కడికి పోతాడు? తప్పకుండా తిరిగివస్తాడు ! ఒక వర్షమై, ఒక వసంతమై, ఒక వికసిస్తున్న పూవై, పసిపాప నవ్వై ఈ క్షణం ఇంతకు ముందరి క్షణంలా లేదు ఈ ఇల్లు ఎక్కటి శూన్యంగా అయింది ఎంత అనుభూతి పండు నిలిచి ఉండగానే కాయ రాలిపడింది శరత్కాలం అంతరించింది ఊతకర్ర జారిపోయి తానే ఊతకర్ర కావాల్సి వచ్చిన మనోవేదనను చక్కగా చెప్పారు.

పతంగీ మాంజాదారం గొంతును కోసినపుడు ఆనందాన్ని పంచే పతంగే ప్రాణం తీస్తే పడే బాధను చెప్పారు. ఈ అద్భుతానుభవ ప్రపంచంలోకి ఎప్పుడో అతిథిగా వచ్చిన నేను ఎందుకు చెప్పకుండా వెళ్ళిపోయావు నిర్వేదన. మృత్యువును చూస్తూ చూస్తూ ముక్తి అని అనలేము ఎలా అనగలం జీవులం ప్రతి తీవియా, మొక్కా చిగురించడానికి, పుష్పించడానికి, పడే వేదనతో వసంతం యవ్వనంలో సమన్వయం సామరస్యం కుదరని



ఆవేశం తర్వాత బిడ్డల బరువు, స్వప్నాల బరువు రోగాల బరువు, వైపల్యాల బరువు ఇదేనా జీవితం? ఆవేదన వ్యక్తపరిచారు కవిగారు. నిరంతరం కురిసే తుషారం వల్ల మొత్తం ప్రకృతి ముడుచుకపోయింది వికాసం లేదు, ఉత్సాహం లేదు, ఉత్సవం లేదు గూఢార్థమైన వాక్యం. ముడుచుకున్న పద్మ కోశంలోని తుమ్మెదనై రాని ప్రభాతం కోసం ఎదురు చూస్తున్నాం ఔషధం కావాలంటే నా వెన్నముకనైన ఇచ్చేవాన్ని మృత్యుగహ్వరంలోకి నేను నిన్ను తోసితినా ? తొందరపెట్టానా? పుత్ర ప్రేమకు భగ్న పడ్డ వేదన. ఎల్లెడలా ఎంతో కొంత దుఃఖం ఒక చోట ముల్లు, ఒక చోట ఖడ్గం, ఒక చోట కాలకూటం దుఃఖాన్ని వివరించారు ఆచార్యగారు. (నిలువెత్తు కోసుకునే గాయాలు) వైఖరిని దాటేందుకు గోదానం చేయాలా నా వాఙ్మయ తపస్సు అంతా 'గో' దానమే. భావ్యమైన అనేకాశాలు దాటిన ఈ నిచ్చెన అమ్మ పాదాల దగ్గర అవనతమైంది. నా చేతిలో పూసిన పూవులన్ని ఆమె పాదాల దగ్గరనే – వాటి సార్థకత ముక్తి ఎక్కడో వెనుకబడింది నీవు ఇక్కడకి చేరినావా పుత్రుడా ! పుత్రుని చిరునామా అడిగిన రాని జవాబు చక్కని వాక్య కూర్పు. మార్గమే లేదు మార్గ దర్శనమెక్కడ స్వర్గమే లేదు నరకం కానిదెక్కడ అవిశ్వాసులకు తీరం దొరకదు. . . అన్ని చెప్పె నిత్య సత్యం. అనుద్విష్ట కార్యమేదో ప్రపంచ గతిని మారుస్తుంది నిమిషంలోనే వర్తమానం స్థంభిస్తుంది. భవిష్యత్తు మాయం మవుతుంది భవిష్యత్తు శూన్యంగా మిగిలే భ్రమ మనందరిలో ఉంది. ఏ దుష్కర్మ 'రక్త ఉప్పలి'యై మొలకెత్తిందో గుండెల్ని చీల్చి ప్రాణరసాన్ని పిండుకుపోయింది క్షణాన పురుగులు తొలిచే మూలాల తోడి పడిపోనున్న చీక దేవదారు వృక్షాన్ని చక్కని వాక్య సంపద. జీవితానికి అర్థం ఎంతగా ఎదిగిందని కాదు ఎంతగా అన్ని దిక్కులా వ్యాపించిందని కాదు మధుర ఫలాన్ని అందించిందా లేదా ఎంతమంచిని చెప్పే కవితకు సుగంధం. క్రొత్త చిగుళ్ళల్లాంటి ఎన్ని పదాలు, వాక్యాలు యాబది పార్శ్వాలు, సుగంధాలు వెదజల్లుచున్నవి. కోవెల సుప్రసన్నగారి ఈ మణికర్ణిక కావ్యం.

## సర్వదా జ్ఞాపకం మహా కవి శేషేంద్ర

మహోన్నత సాహితీ వ్యక్తిత్వం, వారసత్వం సాహిత్యములో అద్భుత ఆయస్కాంత శక్తి ఉంది. ఆకట్టుకునే లక్షణం ఉంది. కవి రవి లాంటి వాడే. కవిత్వం అనేది ఒక సజీవ ప్రవంతి. కవిని కావాలని ఎవరు మరుగుపరచలేరు. "శేషేంద్ర సాహిత్య ఒక అద్భుత గని లాంటిది." త్రువ్వుతున్న కొద్ది ఎన్నో అమూల్య విషయాలు తెలుస్తాయి. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీష్ భాషల్లో అపార పాండిత్యము కలిగి యుండి, వేదాల సారాన్ని జీర్ణించుకొన్న ఈ మహాకవి రచనలు భావితరాలకు గొప్ప స్ఫూరినిస్తాయి. కవిత్వం నీ కోసం, నా కోసం, మనిషి కోసమన్నావు కవిత్వం ఒక విశిష్ట భాష, కవిత్వం ఒక రసవిద్య 'కవిత్వం మనిషి యొక్క భావాత్మక శరీరం కోసం పుట్టిన అమృతరూప ఆయుర్వేదం' అన్నావు కవి పుదుతాడు. చస్తాడు. "నేను పోతే పోతాను, మళ్ళీ రాకపోవచ్చు; కాని నా జ్ఞాపకాల బారి నుంచి తప్పించుకోలేరు మీరు; "అవి ఆ దేశపు గాలుల్లో పక్షులై పాడుతుంటాయ్ కిరణాలై అల్లుకుంటాయ్" 'నా దేశం నా ప్రజలు అన్న కవితాన్వేషివి' నీ ఊపిరి, నీ ఆశ, నీ ధ్యాస, నీతపన నీ ఆరాటం, నీ పోరాటం కవిత్వం శేషేంద్రా హాట్సాఫ్ !

బిందువు బిందువు కలిస్తే సింధువైనట్లు ఎన్ని పిల్ల కాలువలు, ఎన్ని ఉపనదులు, నదులు, మహానదులు కలిస్తే సముద్రమవుతుంది. సముద్రం నన్ను తన కెరటాల లోగిల్లలో తెరచాప పడవలా నడిపించింది. ఆ నిర్మల గాంభీర్య సముద్రుణ్ణి నాలో నేనే తలుస్తూ 'మౌన సముద్రం' అయిపోయాను. అంటాడు శేషేంద్ర.

నేనెప్పుడు గొంతెత్తినా నా కోసం కాదు కోట్లాది మంది కోసం కాదు నేను పదుతున్న భాధలే నా దేశమంతా పడుతుంది. నా జ్వాలిక నా దేశం నాలిక !" చక్కని వాక్య సంపద శేషేంద్రది.

ఈ తెలుగు కవి కవిత్వంలో హిమాలయాలంత ఎత్తు ఎదిగినవాడు, మహా సముద్రమంత అద్భుత కవిత్వ రసజ్ఞానం కలవాడు. ఈ ప్రతిభా సంపన్నుని కోరి వరించిన అవార్డులు, తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ కేంద్ర సాహిత్య అకాడమీ ఫెలోషిప్ భారత ప్రభుత్వం 'రాంప్ట్రేందు' బిరుదు.



2004 సంవత్సరములో భారత ప్రధాని మన్మోహన్‌సింగ్ గారు శేషేంద్రను సన్మానించడం విశేషం. కీ.శే. మహాకవి శ్రీశ్రీ 'నాది పద్యమా లేక ఫ్రెంచి మద్యమా' అని శేషేంద్ర కవిత్వాన్ని కొనియాడారు. విశ్వనాథ ఈ కవి యొక్క రచన పరమోత్తమ జాతికి చెందియున్నది. ఇట్టి రచన చేయగలవారీ నాడు పట్టుమని పది మంది కూడా లేరు అని శ్లాఘించారు.

'ఎక్కడ బట్టినా ధీర గంభీరశైలి కనిపిస్తుంది. ఇంతగా సాధించినవారు అరుదు' అని పేర్కొన్నారు.

శేషేంద్ర నూటికి నూరుపాళ్ళ కవి, కవిత్వ రహస్యం తెలిసిన కవిత్వ నిర్మాణశిల్పి. రమ్యంగా కుటీరాన రంగవల్లుల్లింది దీనురాలి గూటిలోన దీపంగా వెలిగింది. "సినీ గీత రసమయం".

కులాలకు, మతాలకు, వర్గాలకు, వాదాలకు అతీతమైంది కవిత్వం. కరుణతోనే కవి అవుతాడు ఎవరైనా అంటూ కవిత్వ రచన ఒక వైజ్ఞానిక ఉద్యమం అని కవిసేన మేనిఫెస్టో ద్వారా ప్రకటించిన కవిత్వ నిర్మాణ శిల్పి శేషేంద్ర.

శేషేంద్ర అంటే కవిత్వానికి చిరునామాలా ఉంటాడు. కవిత్వానికి నిర్వచనంలా కవిత్వానికి నిలువెత్తు విగ్రహంలా కవితల చెట్టుపై వాలిన వసంత కోకిలలాగా ఉంటాడు.

కవిత్వ రసంతో అందిస్తే ఏ ప్రక్రియలోనయినా పాఠకుణ్ణి ఆకట్టుకోవచ్చు. "స్వాదు కావ్యరసోన్మిశ్రం శాస్త్ర మప్యుపయుంజతే" అని రుద్రటుడన్నాడు.

'గొరిల్లా' కావ్య వస్తువుకు దేశంలో ఉన్న దారిద్ర్యం, అసహాయులుగా ఆకలితో చచ్చిపోయే అసంఖ్యాక జనం.

'సముద్రం ఒకడి కాళ్ళ దగ్గర కూర్చొని యెరగదు "పర్వతం ఎవడికి వంగి సలాం చెయ్యదు కాని నేను కలయెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది" అనే శేషేంద్ర ఎంత ఎత్తు ఎదిగిన మహామనిషీ !

సందేశంగా చెప్పారు శేషేంద్రగారి కవిత్వం ఎన్నో కొత్త ప్రక్రియలు అవలంభించిన మానిఫెస్టో కవి 'నేను ధాన్యంలోనించి పుట్టాను, ధాన్యం కోసమే బతుకుతాను, మరణించి ధాన్యంలోకే వెళ్ళిపోతాను. . .'.

'నేను మానవ జీవిత పొలాలన్నీ దున్నుతా' అని అంటాడు కవి నడిచే చెట్టు మనిషి; చెట్టుగా ఉంటే ఏడాది కొక వసంతమన్నా దక్కేది; మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను!" అంటాడు శేషేంద్ర.

"కాలాన్ని నా కాగితం చేసుకొంటూ, దాని మీద లోకానికి ఒక స్వప్నం రాసిస్తా, దాని నా ఊపిరితో సంతకం చేస్తా !" శేషేంద్ర కవిత్వంలోని గొప్పతనం కొత్త అభివ్యక్తి, శేషేంద్ర కవిత్వం ఒక విశిష్ట భాష. శేషేంద్ర 'నా దేశం నా ప్రజలు' కవి జగత్తు, శ్రామికుడి జగత్తు మిళితమై సాగిపోయిన భావాత్మక కావ్యం. అడుగడుగున ప్రకృతి ఇందులో పులకించి, పరవశించి పోతుంది.

'సూర్యుడు కిరణాల బండ్లు తోలుకొని వస్తున్నాడు' మొదట నన్ను చూచి కన్నీరు కార్చిన చెట్టు ఇప్పుడు నా కలమీద, పూలవాన కురిసింది రాలిన ఒక పువ్వే నా అతిథి, కొమ్మల్లో ఆకుల మాటున చూస్తే, అగుపిస్తాయ్ పక్షుల అడుగులు, నిరుడు ఎగిరిపోయిన నిమిషాల గురుతులు; చక్కని సరళి.

"సముద్రాలు, భూమి ప్రేమలేఖలు రాసుకొనే నీలిసిరా గిన్నెలు, ఆ సిరాలోంచి గాలులు మోసుకొచ్చే అక్షరాలే సామ్రాజ్యాలు, నాగరికతలు, విజ్ఞాన పరిమళాలు.

శేషేంద్ర రసైక ప్రేమమూర్తి, పురుషుడు తనకు కావలసిన రసాత్మక, భౌతిక, మానసిక ఆనందాన్ని స్త్రీ నుండి పొందుతాడు, సంతృప్తిని బతుకులో నింపుకుంటూ పరిపూర్ణ విజయుడై ముందుకు సాగుతాడు.

మరిన్ని శేషేంద్ర లేఖలు ఆపై చక్కని ఆంగ్ల భాషా సాహిత్య విశేషాలతో శేషేంద్ర స్మృతి ముప్పది పేజీలు నిండిన ఈ విలువైన గ్రంథం ఒక మహారచయిత గురించి తెల్సుకొను సంక్షిప్త వివరణలు మరిన్ని ఛాయాచిత్రాలతో నిండుగా కనబడే ఈ మాలిక అందరు చదివి ఆ మహాకవి సాహిత్యంలోని ఇదొక సూచిక, సబ్బని లక్ష్మీనారాయణ చక్కగా వివరించారు. పరిశోధక అంశంగా మన పరిశోధకులకు ఒక కీనోట్సుగా చక్కని గ్రంథం. ప్రతులకు 6-6-302, సాయినగర్, కరీంనగర్ - 505 001.